# అంతా రోజుల మాహాత్మ్యమే!

[ ప్రజాసమస్యలను ప్రతిబింబించే నాటకం. ]

ర చ యి త :

పోతరాజు రాఘవరావు.

సౌభాగ్యప్రచురణలు ౧.

ఫిబ్రవరి 1954.

రచన: 1949

తొలిప్రదర్శనం

1950 లో.

ఈనాటకం సర్వస్వామ్యాలు నావి.
దీనిని ప్రదర్శించడానికి ఎట్టి అభ్యంతరమున్నూ లేదు. కాని ముందుగా తెలియచేస్తే సంతోషిస్తాను.

—రచయిత.

# స మ ర్ప ణ

అనుక్షణమూ నా హితవు గోరుచూ

ఎంతో సహాయకారులుగా నున్న ప్రాణస్నేహితులు

## శేషగిరి, ప్రకాశరావులకు

హృదయపూర్వకంగా............

## -: ముందుమాట :-

ధనికులకు, సామాన్యులకు జరిగే నిత్యజీవిత సంఘర్షణలో, అనేకులు నలిగి నశించిపోతున్నారు. ఇది అన్యాయమని దీని నరికట్టాలని, అందరికీ తెలుసు. కాని, శుష్కవేదాంతాలతో, కార్యరూపం దాల్చని వట్టి కబుర్లతో కాలం గడుపుతున్నాం.

అందువల్లనే, అవకాశవాదులు, స్వార్థపరులు, మితిమీరి ప్రజల్ని, ప్రభుత్వాన్ని, తప్పుదారిని నడిపించి, ప్రజాభ్యుదయాన్ని నిరోధిస్తున్నారు. వీరిని ప్రతిఘటించాలంటే, నిరక్షరాస్యులైన కోట్లకొలది ప్రజలకు నిజాన్ని, నిర్భయంగాచాటి, వారి సానుభూతి, సహకారాలను, సమీకరించాలి. అందుకు విద్యాసంస్కారాలుగల, యువతీయువకులు ముందంజవేయాలి. ప్రభుత్వాధికారులుకూడ నిష్పాక్షికంగా, చిత్తశుద్ధితో, వ్యవహరించాలి. ఇలా ప్రజలూ, ప్రభుత్వం, చేయిచేయి కలిపి, కృషి చేసిననాడే ప్రజాభ్యుదయాన్ని సాధించగలుగుతాం. ఇదే యీ నాటకంలోని ముఖ్యోద్దేశం. ఇక చదవండి.

—రచయిత.

# ఇందులో

1. శంకరయ్య :— వయస్సు 50 సం॥రా లుంటాయి. ఖద్దరు బురఖాను కవచంగా ఉపయోగించుకొని ఖజానా నింపు కుంటూఉన్న నకిలీ దేశభక్తుడు.

2. శాస్త్రి :— వయస్సు 35 సం॥రా లుంటాయి. శంకరయ్యకు కుడిభుజంలా పనిచేస్తుంటాడు. అదే ఆతని జీవనోపాధి.

3. ధర్మయ్య :— వయస్సు 50 సం॥రాలు దాటాయి. పల్లెటూరు బడిపంతులు. వేదాంతి.

4. కృష్ణ :— వయస్సు 20 సం॥రా లుంటాయి. ధర్మయ్య మొదటి కొడుకు. మానవశక్తికి అసాధ్యంలేదని వాదించే నవయువకుడు.

5. రామం :— వయస్సు 16 సం॥రాలు. ధర్మయ్య రెండవ కొడుకు. పరిస్థితుల ప్రభావం వల్ల, అల్లరిపిల్లవాడౌతాడు.

6. వెంకన్న :— మోతుబరి రైతు. వయస్సు 45 సం॥రా లుంటాయి.

7. ప్రకాష్ :— వయస్సు 25 సం॥రాలు వెంకన్న కాపు కొడుకు. వ్యవసాయ శాఖలో పట్టభద్రుడు. విదేశాభిమాని.

8. రాజారావు :— పోలీసు ఇనస్పెక్టరు. చిత్తశుద్ధిగల ఉద్యోగి. వయస్సు 30 సం॥రా లుంటాయి.

9. ఉష :— వయస్సు 20 సం॥రాలలోపు. శంకరయ్య ఏకైక పుత్రిక. స్వతంత్రాభిప్రాయాలు, ఉన్నతాశయాలు గల నవయువతి.

ఇంకా ఇద్దరు పోలీసులు, పురోహితుడు.

# అంతా రోజుల మాహాత్మ్యమే!

## 1 వ రంగము.

[ ఆరోజు ఆగష్టు 15 వ తేదీ. స్వాతంత్రదినోత్సవ సందర్భములో ప్రజలు ఉత్సవాలూ, ఊరేగింపులూ, సభలూ, సమావేశాలూ జరిపి గతాన్ని స్మరించుకొని స్వాతంత్రసమరయోధులను కీర్తించి, భావిని నిర్ణయించుకొని, కార్యాచరణకై దీక్ష గైకొనవలసినరోజు. ఉదయం తొమ్మిదిగంటలవేళ, శంకరయ్య యింటిలో మధ్యగది. ఒకప్రక్కగా గుండ్రనిబల్ల దానిపై గాంధీజీ విగ్రహం, ప్రక్కన ఒకకుర్చీ, మరియొకప్రక్క మరిరెండు కుర్చీలు, గోడలకు నాయకుల ఫొటోలున్నాయి. గది ముందుభాగం జాతీయపతాకాలతో రంగు రంగు కాగితాలతో అలంకరించబడింది. శంకరయ్య కూతురు ఉష వీధిగడపకు మామిడితోరణాలు అలంకరించుచున్నది. వీధిలో దూరంగా ప్రజలు ఊరేగుతూ పాడుతున్న జాతీయగీతం వినిపిస్తోంది. ఉత్సాహంగా ప్రజలుచేసే జై జై నినాదాలు వింటూ ఉష తోరణాలు అలంకరిస్తోంది. కొంతసేపటికి పాట సన్నంగా వినిపిస్తోంది. ఉత్సాహంతో ఉష గాంధీజీ విగ్రహం దగ్గరకువచ్చి పూలమాలవేసి నమస్కరిస్తుంది. ]

ఉష—మహాత్మా! నీ ఆశయాలు, ఆదర్శాలు భారతదేశానికే కాక, యావత్ ప్రపంచానికి యీనాడు వెలుగుబాటను చూపిస్తున్నై. అమూల్యమైన నీశాంతి సందేశాన్ని, దేశదేశాలకుచాటి విశ్వమానవ కళ్యాణానికి తోడ్పడేశక్తిని మాకు ప్రసాదించు.

అంతా రోజుల మాహాత్మ్యమే !

[ప్రకాష్ లోనికివస్తాడు. అతడు పూర్తిగా దొరవేషంలో ఉన్నాడు. ఉష బొమ్మకు నమస్కరించడం చూచి కొంచెం ముందుకు వచ్చి రెండుచేతులు జోడించి]

ప్రకా—పరలోకమందున్న ఓమహాత్మా! నానమస్కారమును కూడ అందుకొని మమ్మాశీర్వదించుము.

ఉష—(చూచి) ఎందుకీ దొంగదణ్ణం !

ప్రకా—My God ! నాది దొంగదణ్ణం, నీది సిసలైన దణ్ణమూనా !

ఉష—అంతే, వేసింది విదేశీయ వేషము, చేసేదీ దేశీయ నమస్కారము.

ప్రకా—అంటే సూటు వేసుకుంటే చేతులు జోడించి నమస్కారము పెట్టకూడదనా నీ అభిప్రాయం?

ఉష—అసలు సూటే వేయకూడదని.

ప్రకా—షెబాష్. బాగుంది, చాలాబాగుంది. ఈసూట్లు వేయడాన్ని నిషేధిస్తూ అసెంబ్లీలో ఒకబిల్లు ప్రతిపాదిస్తే ఇంకా బాగుంటుంది.

ఉష—మనం మూర్ఖులమైతే అంతే జరుగుతుందిలే.

ప్రకా—అలాజరగదులే. మన పెద్దవాళ్ళలోకూడ చాలామంది సూట్లు వేసేవాళ్లున్నారు. వాళ్లు ఒప్పుకుంటారా ఇలాంటి మార్పుకి?

ఉష—ఎలా ఒప్పుకుంటారు? దొరలు మనల్ని విడిచిపోయినా మనం వాళ్ళ వేషభాషల్ని వదలలేము.

ప్రకా__నీవేమనుకున్నా గాని ఈరోజులలో ఖద్దరుబురఖాలకన్నా యీవేషానికే ఎక్కువ విలువఉంది. పూర్వము ఖద్దరు ధారణ దేశభక్తికి చిహ్నం. ఆరోజులలో తెల్లటోపీ, అహింసాసమరయోధులకు చిహ్నం. యిప్పుడు అది పచ్చి బ్లాకుమార్కెటీర్లకు.................

ఉష__ఉష్! (మాట్లాడకూడ దన్నట్లు సౌజ్ఞ చేస్తుంది.)

ప్రకా__very sorry ఇది దేశభక్తుల యిల్లని మరచి పోయాను.

ఉష__వచ్చిన పనికూడ మరచిపోయావా?

ప్రకా__పని ఏమిటి! పని! మాకు పనీ లేదు, తీరికా లేదు!

ఉష__అవును. క్రియాశూన్యులకు అదే పనిలే.

ప్రకా__మన ప్రణాళిక ఫలించేవరకు అలాగే అనుకుంటూఉండు.

ఉష__నీకూ ఒక ప్రణాళిక ఉందన్న మాట.

ప్రకా__ఓ! వివరాలు చెప్పుతాను విను. మొదట కారు కొనాలి. తరువాత యీపాత యిల్లు మార్చివేసి పెద్దభవంతి కట్టాలి. ఆపైన నిన్ను పెళ్ళిచేసుకొని పత్నీసమేతంగా హాలీవుడ్ వెళ్ళిరావాలి. యింకా ...............

ఉష__చాల్లే, చాలు. గాలిలో మేడలు కట్టుతున్నావు.

[ వీధిగుమ్మంద్వారా "అక్కా" అనిపిలుస్తూ రామం ప్రవేశిస్తాడు. రామంకు 16 సం॥ ఉంటాయి. కొంచెం మాసినబట్టలు, చిందరవందరగాఉన్న అతని క్రాపు లేమిని సూచిస్తున్నాయి. అతనిచూపు, నడక, మాట అన్నీ అదుపుఆజ్ఞలులేని అల్లరిపిల్లవాడని చాటుతూ ఉంటాయి. చరచర లోనికి వస్తున్న రామం ఉషాప్రకాష్‌లను చూచి, కొంచెం వెనుకకు తగ్గుతాడు ]

ఇంతా రోజుల మాహాత్మ్యమే !

ఉష___రా రామం రా. ఏమిటీ విశేషం?

రామం___నీతో చిన్నపని ఉంది, అక్కా. (అంటూ ప్రకాష్‌ను చూచి చెప్పడానికి సందేహిస్తాడు)

ఉష___ఫరవాలేదు, చెప్పు. ఏమిటది.

రామం___(ఉషదగ్గరగా వెళ్ళి చెవిలో చెప్తాడు).

ఉష___ఓస్, యింతేనా. దాని కంత దాపరిక మెందుకు. వస్తానుండు. (లోనికి వెళ్లుతుంది)

రామం___(ప్రకాష్‌తో) ఏం బావా యీమధ్యన నాతో మాట్లాడడం...

ప్రకా___నువ్వెక్కడరా చాలా పెద్దవాడి వయ్యావు.

రామం___యింకా పెద్దవాడి నవాలనుకుంటూంటె.

ప్రకా___దానికేం. కొన్నాళ్లు ఇనపకటకటాలమధ్యన ఉంటేసరి.

రామం___అయితే యీపెద్ద లంతా ఒకప్పుడు అలా ఉన్నవాళ్ళన్న మాట.

ప్రకా___వాళ్ళమాటకేమిగాని మరెక్కడైనా మొన్నటిలాగే చేసేవంటే ఈసారి జైలు తప్పదు.

రామం___మొన్న నేనేమీ చేయనిదే.

ప్రకా___ఏమీ చెయ్యకపోతేనే,పోలీసుస్టేషనుకు తీసికొనివెళ్లారా?

రామం___నే నెప్పుడు వెళ్లాను స్టేషనుకు?

ప్రకా___ఒరేయి రామం నన్ను డబాయిస్తావెందుకురా? నీవు చదువు మానెయ్యడం, జీతాల కిచ్చినసొమ్ము సిగరెట్లకి, బీడీ

లకు ఖర్చుపెట్టడం, ఆ తరువాత పుస్తకాలుకూడ అమ్మే
సి ఇంటికి రాకుండా తిరగడం, శాస్త్రిగారి జేబులో పెన్ను
కొట్టెయ్యడం, అన్నీ తెలుసునురా!

రామం—(మాట్లాడక నిలచి ఉండును.)

ప్రకా—కుర్రతనం చేష్టలు మాని బుద్ధిగా మసలడం నేర్చు
కోరా! మీనాన్న పరువుమర్యాదలు నిలబెట్టరా!

ఉష—ఇదిగో రామం! (అని మూడురూపాయిలిస్తుంది) అంతే
ఉందని నాన్నతో చెప్పు.

రామం—(తీసుకొని మాట్లాడక వెళ్ళిపోతాడు.)

ప్రకా—ఎందుకు మూడు రూపాయిలు ?

ఉష—బియ్యానికి కావాలని వాళ్ల నాన్న కబురంపేడు.

ప్రకా—సరే. ఇదొకకొత్త స్టంటేమో! దొంగవెధవ.

(శంకరయ్యగారు ఆగినశబ్దం. లోనికి విసుగ్గాప్రవేశిస్తూ)

శంక—వెధవలు, దొంగవెధవలు, అల్లరివెధవలు. (చేతినున్న
దండ ఉషచేతికిస్తాడు. ఉష లోనికి వెడుతుంది.)

ప్రకా—ఎవరావెధవలు మావయ్యా !

శంక—ఒకరేమిటి ! అంతావెధవలే! అంతాదొంగలే! సభ జరగ
నిస్తేనా ! అసలు అల్లరిచేయడానికే వాళ్ళక్కడికి వ
చ్చారు.

ప్రకా—అదేమిటి నీబోటివాడి సభలోకూడ అల్లరే!

అంతా రోజుల మాహాత్మ్యమే!

శంక — అలాతయారయ్యారు అదుపు ఆజ్ఞలు లేకుండామనవాళ్లు. మిడిమిడిజ్ఞానంతో ఏకుర్రవెధవో ఆపేపర్లోవి, ఈపుస్తకాల్లోవి నాలుగుముక్కలు సంజుకొని ఏదో ఏదేశంలోనో అదేదో బ్రహ్మాండం బ్రద్దలవుతోందని మనగొర్రెలకి నూరిపోస్తాడు. కాస్త పచ్చగా ఉన్నవాళ్ళందరినీ దుయ్యబడతాడు. దాంతో యీగొర్రెలన్నీ వెనకాల పడతాయి. ఇంక చూచుకో ప్రతిసభకీ సమావేశానికీ యీ గుంపు హాజరు. ఎడ్డెం అంటే తెడ్డెం అని అర్థంలేని ప్రశ్నలు వెయ్యడం. మొత్తానికి సభ అంతా గలాభా. ఇదీ ధోరణి.

ప్రకా — మీబోటిపెద్దలంతా అలాఊరుకుంటుంటే వాళ్ళ ఆటని అరికట్టేదెవరు?

శంక — ఎందుకు ఎందుకని ఊరుకోంటుంటే... (ఉష రెండు కాఫీలు తీసుకొనివచ్చి, వారికి అందిచ్చి వెళ్లిపోతుంది.)

ప్రకా — (కాఫీ త్రాగుతూ) మీరుకనుక ఊరుకోంటున్నారుగాని, యిదే అమెరికాలో అయితేనా?

శంక — ఒక్క ఆటంబాంబుతోసరి వీళ్ళపని.

ప్రకా — అలాంటిదే ఏదైనా మీరూ ఉపయోగించాలి.

శంక — అంతవరకూ ఎందుకు? గట్టిగా తల్చుకుంటే యీకోతిమూకలికి సమాధి కట్టించనూ? (లేచి) ఉంటావుగా (లోనికి పోబోవును.)

ప్రకా___పట్నం పోవాలి. చూచి పోదామనివచ్చి కూర్చుని పోయాను. వస్తాను మామయ్యా! (చెరియొకప్రక్కకి వెళ్లి పోదురు.)

(మళ్లీ జై జై నినాదాలు, ప్రజల కోలాహలం, "శంకరయ్య నశించాలి, దొంగ వ్యాపారం నశించాలి, ప్రజలందరికి తిండీ గుడ్డా కావాలి" కేకలు)

ఉష___(గుమ్మం ముందుకు వచ్చి వాళ్లని చూస్తూ నిలబడుతుంది.)

"ధనమత్తుని పీడరా, దరిద్రులనే
చూడరా, ధర్మమేజయించురా,
ధనికుడవీ వొటకీ దరిద్రులెగా తోడురా."
(అని లోనుండిపాట)

[కొంతసేపటికి పాట వినిపించటం క్రమంగా తగ్గుంతుంది. అదే పాటను ఉష పాడుతూ అచట బల్లపైనఉన్న పూలకుండీని సవరిస్తుంది.]

(లోనుంచి "ఉషా!" అనికేక... ఉష పాట ఆపేస్తుంది. కానేపు నిశ్శబ్దం. తిరిగి పాడుతుంది. తిరిగి లోనుండి "ఉషా" అనికేక. ఉష పాట ఆపేస్తుంది. చేతిలో పేపరుతో శంకరయ్య కోపంగా వస్తాడు.)

శంక___పాట ఆపమంటే వినబడడంలేదూ! చెవులు పనిచెయ్యటంలేదా!

ఉష___ఇందులో తప్పేముంది నాన్నా!

శంక___తప్పా! తప్పున్నరా! ఏమిటా వెధవపాట.

ఉష___వెధవపాటా యిది.

అంతా రాజుల మాహాత్మ్యమే!

శంక__కాక.

ఉష__కష్టసుఖాలను జీర్ణించుకొని స్వానుభవంతో వ్రాశాడు ఒక ప్రజాకవి.

శంక__అంతా ప్రజాకవులే! అంతా ప్రజాసాహిత్యమే. భాగ్యవంతులు భస్మమవాలన్నంత మాత్రాన, ప్రజాకవి అవుతాడా! (కూర్చుని పేపరు చదువుతూ ఉంటాడు.)

ఉష__భాగ్యవంతులంటే అందరికీ ఎందుకు చెందుతుంది నాన్నా! ధనమదాంధతచే కన్నుమిన్నుగానక పేదల రక్తమాంసాలతో................

శంక__(పేపరు చదువుట ఆపి కోరగా చూస్తాడు.)

ఉష__పేదల జీర్ణ శల్యపంజరాలతో, కష్టార్జితమైన పేదల సొమ్ముతో, భోగభాగ్యాలతో తులతూగే, యీ సంఘద్రోహులు, స్వామిద్రోహులు, దేశద్రోహులు......

శంక__(బిగ్గరగా) ఉషా!

ఉష__(ఉష మాట్లాడదు.)

శంక__ఇది ఉపన్యాసవేదిక కాదు. తెలుసునా!

ఉష__ఆ......తెలుసును! ఇది స్వేచ్ఛారాహిత్యమైన భాగ్యవంతుల యిల్లని.

శంక__ఇక్కడ నీకు స్వేచ్ఛ లేదా?

ఉష__ఎలా వుంటుంది నాన్నా! ఎండవానల కాశ్రయమైన ఆపూరిగుడిసెలలో ఉన్న స్వేచ్ఛ, ఆనందము యీ భాగ్యవంతుల భవనాల్లో అదృశ్యమైపోతోంది.

శంక___ఈరోగం నీకూ వచ్చింది? (వికటంగా నవ్వుతాడు)

ఉప___రోగమేమిటి నాన్నా ?

శంక ___ భాగ్యవంతులను నిందించేరోగం. ఎన్నిరోగాలకైనా మందుంది కాని, యీరోగానికి ఏమందూ లేదు.

ఉప___లేకేమి ! ఉంది. భాగ్యవంతుల పశ్చాత్తాపమే దీనికి మందు.

శంక___భాగ్యవంతులూ, పశ్చాత్తాపము! భాగ్యవంతులు తేరగా దొరుకుతున్నారు యీ ప్రజాకవులకు ప్రజలకు. ప్రతీసినీమాలోనూ, ప్రతీనాటకంలోనూ, ప్రతీనవల్లోనూ, ప్రతీపాటలోనూ, భాగ్యవంతుల బ్రతుకే వీళ్ళ కలాలకు లోకువగా దొరుకుతోంది.

ఉప___పేదలుకూడా అలాగే లోకువగా దొరుకుతున్నారు ధనవంతులకు.

శంక___ధనవంతులు దగ్ధమైతే, అందరూ దగ్ధమవవలసిందే! ఏదీ మచ్చుకు చెప్పూ, ధనవంతులసహాయం, సహకారంలేనిదే ఏవ్యక్తి, ఏసంస్థ, ఏఉద్యమం, ఏప్రభుత్వం, నిలబడిందో? కబుర్లకేం! లక్షచెప్పవచ్చు. కబుర్లు కార్యరూపంలోకి వస్తే పైసాలేనిదే పనిజరుగదే.

ఉప___అదే పొరబాటు. ఆదురభిప్రాయమే నశించాలి. కార్యసాధనాపరులకు పరువు ప్రతిష్టలు కావాలిగాని పైసా కాదు.

అంతా రోజుల మహాత్మ్యమే!

శంక—పైసాతోనే పరువుప్రతిష్టానూ. డబ్బు లేనివాడికి పరు వెక్కడిది? ప్రతిష్ట ఎక్కడిది?

ఉష—పేదల కా పరువు ప్రతిష్టలు కలుగజెయ్యడానికే కవులు తమ కలాలని నడుపాలి. గాయకులు ఎలుగెత్తి చాటాలి.

శంక—చాటుతారు. ఎలుగెత్తి చాటుతారు. ఇంటివద్ద పెళ్ళాం బిడ్డలు, ఉపవాసదీక్ష సాగిస్తూంటే, ఊరులో బాకీల వాళ్లు పీక్కుతింటూంటే, కట్టగుడ్డ నిలువనీడ లేక, ఆక లిజ్వాలకు దహించుకుపోతూ, ధనికులను దగ్ధమైపోమన్నం దుకు యిదే ప్రతిఫలమని డప్పువుచ్చుకొని చాటుతారు.

ఉష—ప్రాణాలమీద ఆశలేనివారిని యీఆకలిబాధ అప్పులబాధ ఏమీచేయవు నాన్నా! కొనఊపిరి ఉన్నంతవరకూ యీగొప్పవారి పొగరు నశించేవరకూ ఈధనమదాంధు లంతా పరివర్తనాన్ని పొందేవరకూ, ప్రజాహృదయాల్లో నవ్యభావాలు రేకెత్తేవరకూ, ప్రజాసేవకులు తమ ప్రయ త్నాన్ని విరమించరు నాన్నా!

శంక—విరమించరు. మింగడానికి ముద్దలేకపోయినా, మీసాలకి సంపంగినూనెట. పెళ్ళాం బిడ్డల్ని ఉద్ధరించలేనివాళ్లు దే శాన్ని ఉద్ధరిస్తారట, దేశసేవకులట, చెప్పేదొకటి, చేసే దొకటి.

ఉష—చెప్పేదానికి, చేసేదానికి సంబంధంలేకుండా ప్రవర్తించటం పేదలకి అలవాటులేదు, భాగ్యవంతులకే.

శంక—ఉస్తమానూ, భాగ్యవంతులూ, భాగ్యవంతులని నింది స్తున్నావు. నీవుకూడా ఆవర్గానికే చెందిన దానివని మర్చావా !

ఉష—పుట్టుకచేత ఆవర్గమేనాది. కాని ఆశయాలు మాత్రం...

శంక—ఆకూలి వెధవలివి.

ఉష—మాట జారకునాన్నా ! పరనింద పెద్దలకు భావ్యంకాదు.

శంక—చాల మారిపోయావు ఉషా !

ఉష—ఇంకా పూర్తిగామారాలి. యీభోగభాగ్యాలను, మేడ మిద్దెలను, తుచ్ఛసుఖాలను వదలి, పూరిగుడిసెలలో ప్రశాంత జీవితం గడుపుతూ నోరూ వావిలేని పేదల కోసం పాటుపడాలి. అదే నాఆశయం, అదే నాజన్మ సాఫల్యం, అదే నాచిరవాంఛనీయం.

శంక—కారుకూతలు కూయక యికనైనా దారిలోకిరా.

ఉష— దారిలోకి రాబట్టే యిదంతా నాన్నా ! కుల మత విభే దాలు, ధనిక సామ్రాజ్యవాదాలు, ఆకలిదప్పుల ఆర్తనా దాలు లేక ప్రశాంతమైన ఆదర్శలోకానికి దారి. భారత జాతీయ పతాక ప్రతిష్ట నిల్పడానికి దారి. పూజ్య బాపూ జీ చూపిన దారి. అదే మన కందరకూ దారి.

శంక— బాపూజీకి మాత్రం భాగ్యవంతుల అండ లేదా ? కాం గ్రెసులో ఉన్నవారు ధనికులు కారా ?

ఒంతా రోజుల మాహాత్మ్యమే!

ఉష— వారంతా తమ ఆస్తి పాస్తులను దేశసేవ కోసం, ప్రజాసేవ కోసం వినియోగించిన త్యాగశీలురు.

శంక— అంతా త్యాగశీలురే! చేతిలో సొమ్ము లేకపోతే కన బడుతుంది వీరి త్యాగం.

ఉష—అయితే బాపూజీని, కాంగ్రెసుసంస్థని కాదన్నాక, మరి నీకీ బురఖా వేషమెందుకు ?

శంక—(మాట్లాడడు.)

ఉష—లోకాన్ని మోసంచేయడానికా నాన్నా !!

శంక—(కోపంగా చూస్తాడు.)

ఉష—అమాయక ప్రజల కళ్ళల్లో కారంజల్లడానికా నాన్నా !

శంక—(మరికొంచెం కోపం.)

ఉష—ప్రభుత్వం గొడుగుక్రింద రక్షణతీసుకోడానికా ?

శంక—(కోపంతో లేచి) నోరుముయ్యి ! (అని ప్రక్కనున్న బల్లపై కొట్టగా దానిమీదనున్న గాంధిబొమ్మ క్రింద పడి బ్రద్దలౌతుంది.)

ఉష—ఆ......బాపూజీ ! (అని క్రిందనున్న ముక్కలు ఏరును)

శంక—ఎందుకెందుకని ఊరుకుంటుంటే......

శాస్త్రి—(ప్రవేశిస్తూ) ఆ ! చూడండి, కలం చేతిలోఉందికదా అని యీపత్రికా సంపాదకులకు పొగరుబోతుతనం ఎక్కు వవుతోంది.

శంక—ఏమిటది ? (ఉష వెళ్ళిపోతుంది).

శాస్త్రి—ఒకపత్రిక పేరు......పేరు...

శంక— పే రెందుకులే. మనల్ని గురించి ఏమయినా...

శాస్త్రి—వ్రాశారు... అంతా మనల్ని గురించే. వినండి ము ఖ్యాంశాలు.

శంక—ముఖ్యాంశమో, సారాంశమో! కానియ్యి.

శాస్త్రి—మీరు Food Committee మెంబరుగా ఉన్నప్పుడు ......ఉన్నప్పుడు

శంక—ఆ! ఉన్నప్పుడు— నానుస్తా వెందుకు? చదువు.

శాస్త్రి—నాకు నోరాడ్డం లేదండీ చదవడానికి.

శంక—ఫరవాలేదు. చదువు

శాస్త్రి—పంచదార బ్లాకుమార్కెట్టులో......

శంక—ఆ......అమ్మించేను...తరువాత?

శాస్త్రి—కిరసనాయిలు...

శంక—అదీ బ్లాకుమార్కెట్టు చేశాను.

శాస్త్రి—ధాన్యం...

శంక—ఒక్క ధాన్యం ఏమిటి? ధాన్యం, బట్ట, యింకా యింకా అన్నీ అమ్మించేను. అయితే ఏమంటారు?

శాస్త్రి—అన్నీ మీరే ఒప్పుకున్నాక అనేదేముంది?

శంక—నాకు ఏమిటూ శిక్ష విధించేదీ అని. జైలా, లేక జరిమానా? అదీ యిదీ కాకపోతే ఉరిశిక్షా?

అంతా రాజుల మాహాత్మ్యము!

శా(స్త్రి)—మీకు శిక్ష విధించేవా డెవడండీ?

శంక—ఒకవేళ విధించినా, యింతకన్న వేరేశిక్ష లేదుకదా? అన్నింటికి సిద్ధమయ్యే యున్నాను. నా ఆశయం నెరవేరింది. కావలసినంతసొమ్ము సంపాదించాను. నే నెలాపోయినా నాకుటుంబానికి పదితరాలవరకూ లోటులేదు. ఇంక శిక్ష. అంటే నాకు భయమేమిటోయ్ శా(స్త్రీ)!

శా(స్త్రి)—మీకు భయమనికాదండీ. మీకు శిక్ష విధించేవాడికే భయం.

శంక—ఏం?

శా(స్త్రి)—ఆశిక్ష విధించేవాడూ మన తరహాలోని మనిషే. వాడిపైవాడూ అంతే. Top to bottom అంతా మన బాపతులోకే జమ. అలాంటప్పుడు, మీకు శిక్షవిధించడానికి ఎవడికి గుండె లున్నాయంట?

శంక—మనల్ని శిక్షించటానికి ఆభగవంతుడికే గుండెల్లేవు. ఇక మానవమాత్రు లెంతోయ్!

శా(స్త్రి)—Certainly Sir! మనమేకాదుటండీ ఏఅభిషేకాలు చేయించినా, ఏపూజలు చేయించినా ఆదేముడికీ.

శంక—లేకపోతే తిండికే లేనివాళ్లు దేవుడికే౦చేస్తారోయ్? దేవుడిసొమ్ము తిన్నా మనమే తినాలి. పెట్టినా మనమే పెట్టాలి.

శాస్త్రి—Surely Sir! తిట్టినా మనమే తిట్టాలి, కొట్టినా మన మేకొట్టాలి, చంపినా మనమే చంపాలి; మాడ్చినా మనమే మాడ్చాలి. Why all this? ఆభగవంతుడుకూడ మన దగ్గర గజగజలాడుతూ నిలుచోవలసిందే!

శంక—అంతేకదా!

శాస్త్రి—తప్పకుండా Sir!

శంక—భగవంతుడుకూడ లంచంలేకుండా వరం యివ్వడే. లంచం యివ్వాలంటే...

శాస్త్రి—పైసా కావాలి.

శంక—పైసా కావాలంటే.....

శాస్త్రి—కళ్ళల్లో కారం జల్లయినా సంపాదించాలి.

శంక—అందుచేత మనం చేసేది...

శాస్త్రి—తప్పుకాదు. ఎంతమాత్రం తప్పుకాదు Sir!

శంక—తప్పని అనేమగవాడెవడో వచ్చి నిలబడమను నాయెదుట?

శాస్త్రి—మీయెదుట నిలబడేవాడెవడండీ సార్! మీకు పైన ఖద్దరుకవచం ఉన్నంతసేపూ, మీయెదుట నిలబడడానికి ఎవడికీ గుండెలున్నాయండీ! వేళ్ళతో పాతుకుపోయిన British సామ్రాజ్యాన్నే కదలించారు మీరు.

శంక—ఔనువా! అటువంటప్పుడు, యిలాంటి చచ్చుపత్రికా సంపాదకులకు స్వస్తి చెప్పటం......

అంతా రోజుల మాహాత్మ్యమే !

శాస్త్రి—ఇదెంతపని! నిముషాలమీద, సెకండ్లమీద. Trunk call Book చేసి మనవాళ్ళతో మాట్లాడారంటే next moment లోనే చేతికీ, నోటికీ సంకెళ్ళు. ఎందుకు ఎందుకూ అని ఊరుకుంటున్నారుగాని...

శంక—కాకపోతే వీళ్ళు అంతం చూడలేకపోయేవాడినా? మొన్న ఎలక్షనులో పోటీచేశానా? అప్పుడూ అంతే! తప్పుడు వ్రాతలూ, కారుకూతలూ.

శాస్త్రి—అవునంటోయ్. అవును. అందులో నావిషయంకూడ_

శంక—ఆ! ఉంది, ఉంది. బ్రాహ్మణుడవై యుండి మీపంతులు గారిని పదవికి ఎక్కించడానికి ప్రయత్నం చేయక, నా వెంట పడ్డావని.

శాస్త్రి—నేనేకాదు. ఆవ్రాసినవాడికికూడ ఒక పచ్చకాగితం చూపిస్తే కళ్ళు చెమ్మగిల్లి మీవెంట పడవలసిందే.

శంక—నాకు Administrative capacity లేదుట, చదువూ లేదుట.

శాస్త్రి—చదువెందుకండి చదువు. కుర్చీలో కూర్చుని కాగితాల మీద సంతకాలు చెయ్యటానికి చదువెందుకండీ! అంతా అమర్చి పెట్టడానికి మాబోటివాళ్ళ మున్నాంగా !

శంక—కొంచెంలో తప్పిపోయిందిగాని కాకపోతే నేనీపాటికి ఆ కుర్చీలో కూర్చోకపోయేవాడినోయ్ !

శా స్త్రి—పోనీలెండి ! నెక్స్టు టైం బెటర్ లక్ (వెంకన్న కాపు వస్తాడు.)

శా స్త్రి—ఓహో ! కాపుగారా !

శంక—రండి! రండి ! బావగారూ రండి !

శా స్త్రి—(గబగబావచ్చి కుర్చీ ముందుకు వేస్తాడు. కాపు కూర్చుంటాడు.)

శంక—బావగారు శ్రమతీసుకు వచ్చారే !

వెంక—అహాహా ! మీరు కబురుపంపడమున్నూ........

శా స్త్రి—వారు రాకపోవడమూనా !

శంక—అసలు విషయమేమిటంటే, మీదగ్గర ఏమాత్రం సరుకు నిలవఉందా అని...

వెంక—అబ్బే ! నిల్వ ఎక్కడిదండీ ! ఆమధ్య తహశీల్దారు, మీరు వచ్చి అడిగితే ఉన్న యాభై బస్తాలు యిచ్చేశానుగా.

శంక—యిచ్చావయ్యా ఇవ్వలేదని కాదు. నేనిప్పుడు గవర్న మెంటు మనిషిగా అడగటంలేదు. మనలో మనమాట, ఏమాత్రం ఉంది.

శా స్త్రి—మంచి కిఫాయితీబేరం ఉందండీ ! ఊరుదాటితే మైలు కొకరూపాయి. ఊ ! పోనివ్వకండి.

వెంక—అదాసంగతి. అయితే ఒకటి, రెండుసున్నలు.

శంక—ఇంకనేం ! పంపించెయ్యండి. అసలుకన్న పదిరూపాయిలు ఎక్కువ.

ఇంతా రోజుల మహాత్మ్యమే!

శాస్త్రి—చిత్రం చిత్రం అలాగే కానివ్వండి... కాని ప్రజలంతా రైతులు వ్యవసాయం వదలి వ్యాపారంలోకి దిగి బ్లాకు మార్కెట్టుడబ్బు సంపాదిస్తున్నారని మహాగోల చేస్తున్నారు.

శంకర—పడీశారు చవటలు. వాళ్ళకేం తెలుసును? వ్యవసాయమయితేనేం, వ్యాపారమయితేనేం? ఏదో పదిరాళ్ళు చేర్చుకోడానికేగా, యీ శ్రమ అంతాను. అదీగాక ఎరువుల ధర పెరిగింది. పట్టాలధర పెరిగింది. అన్నింటితో పాటు మనధరకూడా పెరగవలసిందే.

శంకర—సరే కాని, యీ బ్లాకు మార్కెట్టు చేసేవారిని, చేయించేవారిని కఠినంగా శిక్షిస్తామని గవర్నమెంటు ఏదో ఆర్డరు వేశారుటగా?

శంకర—ఎన్ని ఆర్డర్లుంటేనేం? మనపని మనదే.

శాస్త్రి—బాబుగారి చేతిలో ఎన్ని ఆయుధాలున్నాయో మీకింకా తెలియలేదు. మొదట పైసా, ఆపైన టెలిఫోను, అదీ కాకపోతే స్వయంగా ఢిల్లీప్రయాణం.

శంకర—ఇంత ఎందుకయ్యా? అల్లరికాకుండా మన సొసయిటీలారీలే ఉపయోగిద్దాం.

శాస్త్రి—సెభాష్! చూచారా, బాబుగారి యుక్తి.

శంకర—ఇంకొక మాట. యీ వందబస్తాలలో మూడోవంతు గవర్నమెంటు కివ్వాలి. మిగిలిందే మీకు లెఖ్ఖ.

వెంక___ఇంటిలో మళ్ళా......

శంక___తప్పదు. మొన్ననే మీయింటికి తహశీల్దారుగారు వస్తా నన్నారు. నేనే ఆపుచేశాను.

శాస్త్రి___వారికి వీరితో చిన్న అవసరముందిలెండి అంచుచేత బాబుగారి మాట కాదనలేక యీవ్యాపార్ల ప్రొక్యూర్ మెంటుభారం బాబుగారిమీద వదిలేసి ఎన్నిబస్తాలిస్తే అన్నిబస్తాలు పుచ్చుకొని మాటలాడకుండ వెళ్ళిపో యారు.

వెంక___సరే. మీమాటకు......

శాస్త్రి___ఎదురు చెప్పవద్దు. 'ఊ' అనండి.

శంక___శాస్త్రీ! చూడు. ఈబాపతు మూప్ఫయిబస్తాలు మన గొడౌనులో......

శాస్త్రి___అదేనండి? అదే అండర్ గ్రౌండ్.........

శంక___ఉష్. (కోపంగా చూస్తాడు).

శాస్త్రి___నేను జాగ్రత్త పెడతానులెండి.

వెంక___మరి నాకు శలవా ?

శంక___ఆ! కాఫీ త్రాగకుండానే? ఉషా! కాఫీ.

[ఉష కాఫీ, ఫలహారములు తీసుకొని వస్తుంది. శాస్త్రి నాటిని అందుకొని టేబిలుపై ఉంచుతాడు.]

శంక___కాపుగారూ! కానివ్వండి.

వెంక___ఎందుకండీ యివన్నీని?

అంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—కాబోయే వియ్యాలవారి యింట్లో మొహమాట మేమిటి? కానివ్వండి.

శంక—మీకోసం ఆమె స్వయంగా చేసింది. రుచిచూడండి.

వెంక—భోజనానికి పోయేవేళ. కాఫీమాత్రం త్రాగుతాను లెండి.

శంక—అదేమిటి? ఆ టిఫినుకూడ తినాలి.

[ఇంతలో వీధిగుమ్మంవద్దనుండి ముష్టివాని కేక వినిపిస్తుంది.]

వెంక—పాపం! ఈ టిఫిను ఆముష్టివాడికి పెడదామండీ.

శంక—అలా వద్దు. ఈముష్టివెధవలికి యిదొక సులభమయిన వృత్తి అయింది. మనం వీళ్ళని కనికరించకూడదు.

[లోనుండి తిరిగి "అయ్యా! ప్రాణాలు పోతున్నాయి. గుక్కెడు గంజి. అంధుణ్ణి.]

శాస్త్రి—గంజీలేదు. గింజీలేదు. పో పో! బియ్యంతో పాటు గంజికికూడా కరువొచ్చింది. పో పో!!

[అంతా నవ్వుకుంటారు. ముష్టివాడు పాడుకుంటూ పోతాడు. మెల్లిగా తెర పడుతుంది.]



# అంతా రోజుల మాహాత్మ్యమే !

## రెండవ రంగము.

[ధర్మయ్య యిల్లు. శిథిలావస్థలో ఉన్న ఆయిల్లు ధర్మయ్య కుటుంబ దుస్థితిని చాటుతూ ఉందా అన్నట్లు ఉంటుంది. సాయంకాలం ఆరుగంటల వేళ. ఇంటి వీధితలుపు దగ్గరగా వేయబడి ఉంది, రామం మెల్లగా అడుగులు వేసుకుంటూ, భయపడుతూ యిల్లు చేరుకుంటాడు. తలుపు మెల్లగా త్రోసి గదిలో ఎవరూ లేకపోవడం చూసి, ధీమాగా లోనికి వస్తాడు. గదిలో ఒక ప్రక్క ఒక కర్రపెట్టె. దానిపైన చిన్న చిరిగినచాప. దగ్గరగా దీపపుబుడ్డి. మరియొకప్రక్క చిరిగి మాసియున్న గుడ్డలు దండేనికి వ్రేలాడుతూ ఉంటాయి. గది అంతా చీకటిగా ఉంది. ఒక చిన్న నులకమంచం గోడకు చేర్చి ఉంది. రామం లోనికి వచ్చేడు. అటూ ఇటూ చూచి అక్కడ ఉన్న చాప క్రింద పరచుకొని ఒంటినిండా కప్పుకొని పడుకుంటాడు. కొద్ది నిముషాలుతరువాత చేతిలో కిరసనాయిలుసీసాతో కృష్ణ వస్తాడు. కృష్ణ యిరవై సంవత్సరాలప్రాయంవాడు. కొంచెం మాసిన తెల్లపైజామా, భుజాలవద్ద చిరిగిన చొక్కా ధరించి ఉన్నాడు. తైలసంస్కారంలేని అతని జుట్టు, లోతుకళ్ళు, బక్కశరీరము అతని కష్టజీవితాన్ని సూచిస్తున్నాయి. కృష్ణ లోనికి వచ్చి కిరసనాయిలుసీసా పెట్టెమీద ఉంచి రామం పడుకొని ఉండడం చూస్తాడు.]

కృష్ణ—(ఎదురుగావచ్చి) రామం !

రామం—(పలుకడు.)

అంతా రోజుల మాహాత్మ్యమే!

కృష్ణ—రామం! (భుజంమీద కొడతాడు.)

రామం—(ముసుగు మరింత గట్టిగా బిగించి ప్రక్కకు తిరుగుతాడు.)

కృష్ణ—దొంగనిద్ర చాలించి లేవరా! లే!

రామం—(కళ్లు నలుపుకుంటూ తప్పనిసరిగా ముసుగుతీసి కృష్ణ వైపు చూస్తాడు.)

కృష్ణ—సాయంకాలం ఆరుగంటలకే అంత గాఢనిద్రా! లే! లే!

రామం—కడుపులో నొప్పిగా ఉంది. (కడుపుపట్టుకుంటాడు.)

కృష్ణ—అలాగా! (అని దగ్గరగావచ్చి చెవిపట్టుకొని లేవదీస్తాడు) పాపం! యిల్లుచూడగానే కడుపునొప్పి వచ్చిందిరా!

రామం—రెండురోజులనుండి ఎక్కువగానే ఉంది.

కృష్ణ—అందుకేనా యింటిముఖం పట్టకుండా ఊరంతా బలాదూరు తిరగడం.

రామం—అబ్బే! ఎక్కడకు వెళ్ళందే!

కృష్ణ—మరి నిన్న మొన్న ఎక్కడున్నట్టు?

రామం—వెంకటేశ్వర్లు గారింట్లో......

కృష్ణ—ఛీ! వెధవా! నోరువిప్పితే అంతా అబద్ధం. చెప్పు? నిజంచెప్పు? ఎక్కడున్నావ్?

రామం—నిజం! వెంకటేశ్వర్లుగారింట్లోనే!

కృష్ణ—మళ్లా అదేమాటా! తొక్కచీరేస్తాను నిజంచెప్పు. (చెవి పట్టుకుంటాడు.)

రామం—పట్నం వెళ్ళి.........

కృష్ణ—పట్నంలో పెత్తనాలు సాగిస్తున్నావా! ఎవరితో చెప్పి వెళ్ళావురా!

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—నీ విలా అచ్చోసిన ఆంబోతులాగ తిరుగుతూ ఉంటే నీ గురించి మా బుర్రలు ఖరాబు చేసుకొని తిండి తిప్పలు మాని వెదుకుతూ ఉండడమా! అంతేనా!

రామం—నీతో చెప్పి వెళ్ళుదామనుకున్నాను. కాని నీవు కని పించ...............

కృష్ణ—అవును. సమయానికి నేను కనుపించను కాదూ. నాన్న అసలే కనిపించడు. యింకెవరితో చెబుతావు పాపం.

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—ఇంట్లో చెప్పకుండా గుమ్మం కదలవద్దని ఎన్నిసార్లు చెప్పేను నీకు ?

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—చెప్పానా!

రామం—(అవునన్నట్లు బుర్ర ఊపుతాడు.)

కృష్ణ—మరేమిటి యీ తిరుగుడు. కొడితే రెండు లెంపకాయలే కదా అని పొగరుబోతు తనమా!

రామం—(మాట్లాడడు.)

అంతా రోజుల మాహాత్మ్యమే!

కృష్ణ—ఇంతకూ పట్నంలో ఏమంత రాజకీయం ఉందని వెళ్లేవు?

రామం—ఏమైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని.

కృష్ణ—అదా! ఉద్యోగం కోసమా! చదువు చట్టుబండల యింది. యింత ఉద్యోగం కోసం తిరుగుతున్నావన్న మాట.

రామం—(మాట్లాడడు)

కృష్ణ—దొరికిందా ఉద్యోగం?

రామం—లేదు.

కృష్ణ—లేకపోవడమేమి? అక్కడ యిక్కడ, చదువుకుంటానని డబ్బులు దండుకొని అది సినీమాలకు, సిగరెట్లకు, ఖర్చు పెట్టుకుంటూ యింటికి చేరకుండా ఊరంతా బలాదూరు తిరగడం! యిదేనా నీఉద్యోగం.

రామం—అలా తిరగందే!

కృష్ణ—నోర్మూయి! దొంగవెధవ! సిగ్గులేక యింకా మాట్లాడు తున్నావు.

రామం—(పలుకడు.)

కృష్ణ—ఉప అక్కయ్యని అడిగి నాన్న బియ్యంకోసం కావాల న్నాడని మూడు రూపాయిలు పుచ్చుకున్నావా!

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—ఇలా ఎంతమందిదగ్గర అబద్ధాలాడి బ్రతుకుతావురా?

బుద్ధి లేదూ! అడ్డగాడిదలాగ పదహారేళ్లున్నాయి. కొంచె
మైనా జ్ఞానం లేదా అని.

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—నిన్ను పోలీసు స్టేషనుకి ఎందుకు తీసుకొనివెళ్ళారో జ్ఞాపకం ఉందా!

రామం—(ఔనన్నట్లు బుర్ర ఊపుతాడు.)

కృష్ణ—నిన్ను విడిపించడానికి తలప్రాణం తోకకువచ్చింది. గుర్తుందా!

రామం—(తిరిగి ఔనన్నట్లుగా బుర్ర ఊపుతాడు)

కృష్ణ—అన్నీ జ్ఞాపకముండేనా ఈ వెధవపనులు.

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—మూగదేవుడులా మాట్లాడవేమిరా? (రామం ప్రత్యుత్తర మివ్వడు.) ఇలారా! (రామం దగ్గరగా వస్తాడు.) ఇక ముందెప్పుడూ తప్పుచేయనని చెంపలు వాయించుకొని పది గుంజీలు తియ్యి.

రామం—(అలా నిలిచి ఉంటాడు.)

కృష్ణ—నిన్నే! నే చెప్పినట్లుచెయ్యి!

రామం—(మాట్లాడడు.)

కృష్ణ—ఊఁ! గుంజీలు తియ్యి! (చెవి పట్టుకుంటాడు.)

రామం—(చెవి విడిపించుకొని) నేను గుంజీలు తియ్యనుపోదా.

అంతా రోజుల మాహాత్మ్యమే!

కృష్ణ—ఏమన్నావ్! గాడిదా! (అని లెంపకాయ కొడతాడు.)

ఊఁ! తియ్య్! గుంజీలు!

రామం—(చరచరా వీధి గుమ్మంవైపు నడచిపోతాడు.)

కృష్ణ—(ఎదురుగావచ్చి) ఎక్కడికిరా! ఎక్కడికి?

రామం—నేను యింట్లో ఉండను.

కృష్ణ—ఉండవు! పౌరుషవంతుడవి. నడునడు. (అని లోనికి గెంటుతాడు.) చేసినదానికి సిగ్గుపడక పొగరుబోతు మాటలుకూడానా? వెధవ! (అని చెయ్యెత్తి దబాయిస్తాడు. రామం క్రింద పడబోతూండగా)

(ధర్మయ్య వీధిలోనుండి వస్తున్నాడు. ఈదృశ్యంచూచి గబగబా వస్తూ)

ధర్మ—ఏమిటిరా! ఏమిటీ అల్లరి?

కృష్ణ—(తండ్రితో) తప్పు ఒప్పుకొని గుంజీలు తియ్యమంటే పౌరుషమొచ్చింది ముసగాడికి.

ధర్మ—(ఇరువురిమధ్యగా వచ్చి) రామం! ఇలారా! ప్రాయం వస్తున్నవాడివికదా! ఆమాత్రం జ్ఞాన ముండనక్కరలేదురా! రెండురోజులనగా ఇల్లు విడిచిపోయావు. నీవు ఏమయ్యావ్? ఎక్కడున్నావనుకోం?

రామం—నాగురించి మీరేమీ అనుకోనక్కరలేదు.

కృష్ణ—అహా! పిట్ట కూతపట్టిందే.

ధర్మ—ఇదేరా నీవు చెప్పవలసిన సమాధానం! ఇలాచూడు.

అన్నయ్య పెద్దవాడుకదా. నీక్షేమంకోరే బుద్ధిగాఉండరా అంటే తిరగబడతావా.

రామం—పెద్దవాడుకదా అని అస్తమానూ కొడుతూంటే...

కృష్ణ—కొడతావా! తొక్క చీల్చేస్తావా! (మీదకి వస్తాడు.)

ధర్మ—(వారిస్తాడు.) ఉండరా! వాడితోబాటు నీవుకూడ వాదిస్తావు.

రాము—ఆకలేస్తుందంటే అన్నం పెట్టలేరుకాని, అందరూ కొట్టేవాళ్ళే నాన్నా......

కృష్ణ—చూచావా ఎలాతయారయాడో! ఎలాగ మాట్లాడుతున్నాడో. ఈవెధవని ముక్కలుక్రింద తెగనరికినా పాపం లేదు. (అని మీదకు వెడతాడు.)

రామం—ఆ! నరికేస్తావు.

ధర్మ—ఒరేయి కృష్ణ నీవూరుకో. నేనుచెప్తాను. రామం నడు. లోనికినడు. ఎందుకీ అనవసర ఘర్షణ పడు. (రామాన్ని ధర్మయ్య లోనికి తీసికొనిపోతాడు.)

కృష్ణ—గారం ఎక్కువచేస్తేనే పిల్లలు గాడిదలయేది.

(అంటూ అక్కడ పెట్టెమీదఉన్న దీపపుబుడ్డిలో కిరసనాయిలుపోసి వత్తి పెద్దదిచేసి, పెట్టెమీద తిరిగి ఉంచి, పెట్టెను జార్లపడి, చాపమీద కూర్చుని, "లెనిన్ జీవితచరిత్ర" పుస్తకాన్ని చదువుతూ ఉంటాడు. కొంతసేపటికి ధర్మయ్య గదిలోనికి తిరిగివచ్చి, ప్రక్కన ఉన్న నులకమంచం వాల్చుకొని, అలసట తీర్చుకుంటూ ఉంటాడు.]

అంతా రోజుల మాహాత్మ్యము!

కృష్ణ—గారాల కొడుకుని బుజ్జగించి వచ్చావా?

ధర్మ—ఏం చేయమంటావు నాయనా! తెలిసీ తెలియని ప్రాయం. బెదరకొడితే ఏ అఘాయిత్యం చేస్తాడో!

కృష్ణ—ఆ అతిగారమే వాడిసలా పాడుచేస్తోంది.

ధర్మ—పాడుచేయడానికీ, బాగుచేయడానికి మనం కర్తలమా! అంతా దైవాధీనం.

కృష్ణ—అదిగో! దేవుడెప్పుడూ మన నాలుకచివరి నుంటాడు. అన్నీ వాడి నెత్తిన రుద్దడమే!

ధర్మ—కాక మనం చేసేదేముంది? శివుడాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు.

కృష్ణ—అలాగని చీమల పుట్టలు పెంచి ఒంటినిండా ఎక్కించుకోండి.

ధర్మ—పెంచడం చంపడం మన చేతుల్లో ఉంటేగా!

కృష్ణ—చేసే వన్నీ చేసి చివరికి అన్నిటికి నీవే భాధ్యుడవని దేవుడి నెత్తిని రుద్దడం మన చేతిలో ఉందా?

ధర్మ—మనం చేయగలిగిందేమీలేదు. అంతా మన పూర్వజన్మ ఖర్మమీదనే ఆధారపడిఉంది.

కృష్ణ—మాట్లాడితే పూర్వజన్మ-ఖర్మం-యోగం. ఏమిటీ అర్థం లేని వేదాంతం.

ధర్మ—జీవిత మర్మం తెలిసికోని వాడికిది అర్థంలేని వేదాంతం. కాని ప్రతీజీవికీ ఇదే పరమార్థం.

కృష్ణ—ఇక ఈ వేదాంతాలకి స్వస్తి చెప్పాలి.

ధర్మ—చెప్పి......

కృష్ణ—మానవశక్తిని నిరూపించాలి. మానవసంకల్పానికి తిరుగు లేదని ధృవపరచాలి.

ధర్మ—అసలు మానవుడు శక్తి లేని మట్టిబొమ్మయ్యా అంటుంటే.

కృష్ణ—అది నేనొప్పుకోను. మానవుడికి కన్ని శక్తులూ ఉన్నాయి. పంచేంద్రియాలను జయించగలడు. ప్రకృతినే జయించ గలడు.

ధర్మ—ఇవన్నీ కార్యరూపం దాల్చని వట్టికబుర్లు.

కృష్ణ—శుష్క వేదాంతుల కలాగ తోస్తుందిలెండి.

ధర్మ—అయితే నాలుగేళ్ళనుండి నీవు విశ్వప్రయత్నం చేస్తున్నావు. మరినీవు ఎక్కడైనా పదిరూపాయిల ఉద్యోగాన్ని సాధించలేకపోయావే.

కృష్ణ—ఏమూలచూచినా స్వార్థపరత్వం, బంధుపక్షపాతం, కులమతతత్వం ప్రబలింది. నాబోటివాడికి ఉద్యోగ మెలా దొరుకుతుంది.

ధర్మ—నీతోపాటు ప్రయత్నించినవారిలో అందరికి కాకపోతే కొందరికైనా ఏదో బ్రతుకుతెరువు దొరుకుతూందంటావా? లేదా ?

కృష్ణ—మానాభిమానాలు వదిలేస్తే మనకూ దొరుకుతుంది.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ధర్మ—అలా సిద్ధపడినా దొరకదు. అదృష్టం లేకపోతే.

కృష్ణ—ఆ అదృష్టం ఎక్కడో లేదు. ఎవరి అదృష్టానికి వారే బాధ్యులు.

ధర్మ—అక్కడే అడుసులో కాలేస్తున్నావు. ఇన్ని కబుర్లు చెప్ప గలిగినవాడవు చిన్న ఉద్యోగాన్ని అయినా సాధించలేక పోతున్నావేమా అని.

కృష్ణ—సాధిస్తాను. నాకోసం కాదు. దేశంలో ఉన్న ఎందరో నిరుద్యోగులు, నిర్ధనులు, సుఖపడే మార్గాన్ని సాధిస్తాను.

ధర్మ—ఉట్టి కెగరలేనివాడు స్వర్గాని కెగిరాడుట ఎందుకురా ఈ వట్టి కబుర్లు. నిన్ను నీవు బాగుచేసుకోలేవుగాని లోకాన్నంతా బాగుచేస్తానంటావు.

కృష్ణ—దేశమంతా బాగుపడితేనే నేను బాగుపడగలను. అదే నా విశ్వాసం.

ధర్మ—నీ విశ్వాసం మంచిదే కాని అబ్బాయి, భగవత్సహాయ్యం ఉంటేనే గాని మన విశ్వాసాలు ఫలించవు. అందుకే త్రికరణశుద్ధిగా భగవంతుణ్ణి నమ్మి ప్రార్థించాలి ఏనాడు ప్రతివ్యక్తీ, పాపభీతితో దైవచింతతో జీవిస్తాడో, ఆనాడే సంఘానికీ, దేశానికి శ్రేయస్సు.

కృష్ణ—ఆ సత్ప్రవర్తన వేదాంతులు బోధిస్తే కాదు. చట్టబద్ధమైన శాసనాలద్వారా మార్పుతీసుకొని రావాలి. అందుకే ప్రజావిప్లవం సాధించాలి.

ధర్మ—విప్లవం, విప్లవం, అంటూ పత్రికబుర్లలో కాలక్షేపం చేసుకోనక, మన సమస్యలకు మనం పరిష్కారమార్గం ఆలోచించుకోవడం మంచిది.

కృష్ణ—మార్గం మీరు చెప్పినది ఉందిగా? చేతులెత్తి భగవంతుడిని ప్రార్థిస్తే దానంతటఅదే కనిపిస్తుంది.

[చేతిలో మిఠాయి ఉండలతో ఉష వస్తుంది].

ఉష—ఏమిటి బాబాయి! చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నావు?

ధర్మ—ఏముందమ్మా! ఏదో లోకాభిరామాయణం.

ఉష—(మిఠాయి ఉన్నపళ్ళెం ఎదురుగా ఉంచుతుంది.

ధర్మ—ఏమిటీఫలహారాలు?

ఉష—ఇవాళ స్వాతంత్ర్యదినోత్సవం కాదూ?

ధర్మ—మా కెందుకమ్మా యివన్నీని?

ఉష—తినడానికి. ఇంతకీ భోజనాలయాయా?

ధర్మ—భోజనాలా......(కొంచెం నసుగుతాడు).

కృష్ణ—నిజం చెప్పమంటావా? అబద్ధం చెప్పమంటావా?

ఉష—నిజం చెప్పు.

ధర్మ—(చెప్పవద్దన్నట్లు సౌజ్ఞ చేస్తాడు).

కృ—ఇవాళకి రెండురోజు లయింది మేము భోజనము చేసి. ఇంకా యిలా ఎన్నాళ్ళు ఉండాలో?

ఉష—అదేమిటి బాబాయి? నాకు కబురు పంపలేకపోయారా?

అంతా రోజుల మాహాత్మ్యమే!

ధర్మ—తల్లీ! నిత్యదరిద్రుడికి ఎవ రెంతకాలం సహాయం చేయ గలరు చెప్పు? ఏదో మాతిప్పలు మేం పడాలిగాని, యె న్నాళ్ళని యితరులను శ్రమ పెట్టమంటావు?

ఉష—ఒకరికొకరు కష్టంలో తోడ్పడ్డం శ్రమా? ఇరుగుపొరుగున ఉన్నవాళ్ళం ఆమాత్రం సహాయం చేసుకోడంకూడా తప్పా?

కృ—ఈసంగతి మీనాన్నకు తెలిసిందంటే?

ఉష—మంచిపని చేసేటపుడు యితరులకోసం భయపడడం...

కృ—నీదృష్టిలో అవసరం లేకపోయినా, మీనాన్నకోసం అయి నా ఆలోచించాలి.

ఉష—పోనీగాని, మాయింట్లోనుండి అన్నం పట్టుకొనివస్తాను. తినండి.

ధర్మ—వద్దమ్మా! అలాంటిదేమీవద్దు. నీకా అభిమానం ఉంది అంతేచాలు.

ఉష—ఇదేమిటి బాబాయి. ఇలాగ ఉపవాసాలుచేస్తూ.......

ధర్మ—ఏంచెయ్యమంటావు తల్లీ! ఏంచేయమంటావ్! చేసుకున్న ఖర్మ. వచ్చే జీతంరాళ్ళయినా సరిగ్గా ప్రతీనెలా వస్తే మా కీయిబ్బంది ఉండకపోయేది.

కృ—ఒకప్పుడు వస్తే ఇప్పుడు రాలేదని అనుకోవచ్చు. అసలు బసిపంతుళ్ళజీతాలు శాంతినుచే ముడానికి అభాగవంతుడి కింకా లీరిక చిక్కలేదేమో?

ఉష—అవేం మాటలు అన్నయ్యా!

కృ—ఏం చేయమంటావు? అంతా దైవాధీనం.

ధర్మ—బ్రతుకు తెరువు లేకపోతే బతిమంతు లవాలన్నారు. అది అక్షరాలా నిజం. ఎప్పుడూ గొప్రెత్తోక బెత్తెడే.

ఉష—జరిగిందానికి విచారించక, నామాట వినండి. కొంచెం అన్నం పట్టుకొస్తాను......

ధర్మ—వద్దు. వద్దు. మాకు నీవు చేస్తున్న సహాయం చాలు. ఇంకా మాగురించి శ్రమపడవద్దు.

ఉష—అదేమీ లాభం లేదు. నేను అన్నం తెస్తాను. మీరు తినవలసిందే.

[అంటూ చరచరా వెళ్ళిపోతుంది.]

కృష్ణ—మసిబొగ్గులో మాణిక్యం. అదే విచిత్రం.

ధర్మ—చూశావా, కృష్ణా! ఈరాత్రి కటిక ఉపవాసం తప్ప దనుకున్నాను. ఈమిఠాయి ఉండలు......

కృ—ఆ ఎంగిలికూడు కాసిస్తున్నావా?

ధర్మ—ఇది భగవత్ప్రసాదంరా. ఇదిగో, తిను.

కృ—ఛీ, ఛీ, ఇలా ఉపవాసాలతో మాడి చస్తానుగాని, ఆ దేశద్రోహి, పచ్చిబ్లాకుమార్కెట్టువ్యాపారి శంకరయ్య ఇంట్లో పచ్చిమంచినీళ్ళయినా త్రాగను.

ధర్మ—అవన్నీ మనకు అప్రస్తుతవిషయాలు. మనం అడగందే

అంతా రోజుల మాహాత్మ్యము!

తనంతగా తాను, ప్రేమతో ఇచ్చిన భగవత్ప్రసాదం వద్దనకూడదు.

కృ—అనకూడదు. ఎవర్ని ఏమీ అనకూడదు. అంతా దైవాధీనం మనుకోవాలి. ఇదేగా మీవేదాంతం. మీ వేదాంతాలమీద నాకు నమ్మకం లేదు. క్షమించి నన్ను నా దారిని పోనివ్వండి.

ధర్మ—చివరి కంతేలే. ఎవరిదారి వారిదే. (అని ఉండ తినబోతూ ఉండగా)

[వీధిలోనుండి ధర్మయ్యగారూ! ధర్మయ్యగారూ! అంటూ శాస్త్రి లోనికి వచ్చేస్తాడు. శాస్త్రి రావటం చూచి నోటిపద్ద ఉన్న మిఠాయి క్రింద జారవిడచి, ధర్మయ్య ఎదురుగా వెళతాడు].

ధర్మ—రండి, రండి. ఇలా కూర్చోండి.

శాస్త్రి—కూర్చోడానికి నాకు తీరిక ఎక్కడిది? (అంటూనే మంచంమీద కూర్చుంటాడు. క్రింద చాపమీద ధర్మయ్య కూర్చుంటాడు.)

కృ—వెధవ రాబందులు. (విసుగ్గా లోనికి వెళ్ళిపోతాడు).

శాస్త్రి—ఇదేమిటి? ఈమిఠాయి! అబ్బ! ఇప్పు డింకేమీ తినలేనండీ!

ధర్మ—ఫరవాలేదు, తినండి. (అంటూ అందిస్తాడు.)

శాస్త్రి—అబ్బే! ఎందుకండీ, ఎందుకండి? (అంటూనే ఉండ అందుకొని తింటూ) మనబాకీ ఈనెలలో అయినా...

ధర్మ—జమకట్టేస్తారు. ఇంకా జీతం రాలేదు.

శాస్త్రి—ఇంకా జీతం రాలేదూ? నెల అప్పుడే సగం గడిచిపోయింది.

ధర్మ—మీకు తెలియనిదేముంది? ఎలిమెంటరీస్కూలుటీచరుపని చేసేకన్నా ఏగంగలోనయినా పడి చస్తే మంచి దనిపిస్తుంది.

శాస్త్రి—మేష్టర్లకేమిటండి? ఒడుదుడుకులు లేకుండా కడుపులో చల్ల కదలకుండా సంపాదిస్తారు.

ధర్మ—చూస్తున్నారుగా మా సంపాదనలు, మా సంసారాలూ! చావలేక బ్రతుకుతున్నాం. బ్రతకలేక చస్తున్నాం. అంతే!

శాస్త్రి—ఎవరిమట్టుకువారి కలాగే అనిపిస్తుందిలెండి. అసలు ఈ రోజుల్లో సంపాదన అంటేనే కష్టం.

ధర్మ—కాదుటండీ?

శాస్త్రి—తాను కష్టపడి సంపాదించిన సొమ్ములో ఇతరులకు అప్పుఇవ్వడమంటే ఇంకాకష్టం. ఒప్పుకుం...

ధర్మ—తప్పకుండా!

శాస్త్రి—ఆ అప్పు పుచ్చుకొన్న వాళ్లు అ... తిరిగి ఇవ్వక పోతే......

ధర్మ—అదేంమాట! ఇవ్వకపోవడం ధ...



ఆంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—ఆమాత్రం ఆలోచనఉంటే నన్నిలా మీరు తిప్పు తారా!

ధర్మ—ఆలోచన లేక కాదు. సర్దుబాటు లేక.

శాస్త్రి—ఏంమాటలండీ అవి! ఎప్పటిదీబాకీ! మీభార్యకు మందుకోసమని పుచ్చుకొన్నారు. జ్ఞాపకముందా! ఆవిడ చచ్చి రెండేళ్ళయింది. ఇన్నాళ్ళనుండీ నాబాకీ చెల్లించడానికి ఒక్క వందరూపాయిలు......

ధర్మ—వందకాదు ఒక్క చిల్లిగవ్వ చిక్కడంలేదు. ఉన్న సర్వస్వం తెగనమ్మి పెట్టినా. ఆమాయరోగం మాటదక్కించలేక. అదిపోయింది. మేము జీవాలతో మిగిలేం. వచ్చేజీతం తిండిబట్టలకే చాలదు. ఇకబాకీలు ఎలా తీర్చేది?

శాస్త్రి—అందువల్ల మీకు అప్పుయిచ్చినవాళ్ళందరికీ పంగనామా లన్నమాట.

ధర్మ—పరువుగా బ్రతకదలచిన వారెవరూ అలా చేయరు. కొంచెం ఆలస్యం అంతే.

శాస్త్రి—ఈఆలస్యానికి ఏమీ అంతం ఉన్నట్లు కనిపించదు.

ధర్మ—ఎప్పుడూ రోజులు ఇలాఉంటాయా! మాకృష్ణకేదైనా ఉద్యోగం దొరికితే.....

శాస్త్రి—కృష్ణ ఉద్యోగం చేస్తాడు. మీరిచ్చే అప్పులు తీర్చారు. అన్నీ నమ్మవలసిన మాటలే.

ధర్మ—మాగౌరవం, మర్యాద అన్నీ తెలిసిఉన్న మీరే ఆమాత్రం నమ్మకపోతే.........

శాస్త్రి—ఎన్నాళ్లు? నమ్మి ఊరుకుండేది. వాయిదాలు వేయడమేకాని వడ్డీఅయినా జమకట్టలేదు. అసలుకన్న మూడురెట్లు వడ్డీయే అయింది.

ధర్మ—ఎంతయినా, ఇంకకొన్నాళ్లు ఓపికపడితే మీసొమ్ము మీకు దమ్మిడీపైసలతో జమకడతాను.

శాస్త్రి—అదే ఎప్పుడూ అని.....

ధర్మ—మావాడు ఉద్యోగంకోసం శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. మా అదృష్టం బాగుంటే ఒకటిరెండునెలల్లో ఎక్కడో అక్కడ తప్పకుండా.....

శాస్త్రి—రెండుసంవత్సరాలనుండి లేనిది ఈరెండునెలలలో దొరుకుతుందా ఉద్యోగం?

ధర్మ—అలా అనకండి మా మంచిని కోరేవారు.

శాస్త్రి—మంచి కోరబట్టే ఇలా మీయింటిచుట్టు కాళ్లు లాగేలాగ తిరుగుతూంట. లేకపోతే ఏనాడో కోర్టుకెక్కించేవాడిని.

ధర్మ—ఈమాత్రందానికి కోర్టులు ఖర్చులు ఎందుకండి! నేను ఇవ్వనంటేగా!

అంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—ఇవ్వనని వేరే చెప్పాలి? ఇలా ఊరుకుంటే ఎప్పటి కాలదోషం పట్టేస్తుంది.

ధర్మ—కాగితానికి కాలదోషం కాని, మాటకు కాలదోషం...

శాస్త్రి—మీ మాటలుమీద నమ్మకం పోయింది. అసలు మీ దర్శనమవడమే దుర్లభంగా ఉంది. పగలు ఎలాగూ ఇంటి వద్ద ఉండరు కదా! రాత్రులయితే అప్పులవాళ్లు రారు కదా అనా?

ధర్మ—రామరామ. ఎంతమాటన్నారు? దగాకోరు జాబితాలో మమ్మల్ని చేర్చేరన్నమాట.

[ కృష్ణ ప్రక్కగా నుంచొని వింటూ ఉంటాడు. ]

శాస్త్రి—దగాకోరులే కాదు. నీతినిజాయితీలేని పశువులు. (మిఠాయితినడం ముగించేస్తూ) పట్టి దొంగలు.

ధర్మ—ఎందుకండీ మాటలు జారుతారు?

శాస్త్రి—ఇదిగో ధర్మయ్యగారూ! ఇక నన్ను పట్టివాయిదాలతో సంతృప్తి పరచలేరు. ఆరోజులు దాటిపోయాయి. మీరు మర్యాద దక్కించుకోదలచుకుంటే, ఇప్పుడేమైనా, ఈ నోటుమీద జమకట్టండి.

ధర్మ—చేతిలో చిల్లిగవ్వైనా లేదు. దయయుంచి...

శాస్త్రి—మళ్ళీ ఆ పాతపాటే వద్దంట. ఇప్పుడు జమకడతారా! లేదా!

ధర్మ—లేని పరిస్థితుల్లో......
శాస్త్రి—ఉండే దెప్పుడూ అని ?
ధర్మ—కొంచెం గమనిస్తే......
శాస్త్రి—అదేం లాభంలేదు. బాకీ ఇస్తారా! లేదా!
ధర్మ—నామాట విని......
శాస్త్రి—వినను...వినను...వినను.

[కృష్ణ తొందరగా వస్తూ]

కృష్ణ—ఆ! వినక ఏంచేస్తావయ్యా?
శాస్త్రి—అంతవరకూ వచ్చింది వ్యవహారం!
ధర్మ—నీవూరుకో. కృష్ణా!
కృ—(వారించినా విదిలించుకొని శాస్త్రిదగ్గరకు వచ్చి) మీరు సొమ్ము ఇచ్చారు. మేము మీకు గౌరవంగా తిరిగి ఇచ్చేస్తాము. కొంచెం ఓపిక పట్టాలి.
శాస్త్రి—అనవసర విషయాలలో కలగజేసుకోడం మంచిదికాదు.
కృ—నాకూ అవసరవిషయంకాబట్టే చెప్తున్నాను.
ధర్మ—బాబూ! వాడితో మీకేమండీ? ఈనెల జీతం రాగానే ఆలాగే కొంతయినా జమకడతాను.
శాస్త్రి—ఎప్పుడో మీజీతాలు వచ్చేవరకూ బాకీవాళ్ళు ఆగుతారా?
కృ—ఆగక ఏం చేస్తారు?
శాస్త్రి—రాబట్టుకోనేలాగ రాబడతారు.

ఇంతా రోజుల మాహాత్మ్యమే!

కృ—ఊఁ. కానివ్వండి.

శాస్త్రి—ఏమండీ ధర్మయ్యగారూ! ఇదేనా సమాధానం?

ధర్మ—(మాట్లాడడు).

కృ—నే చెబుతున్నానుగా. అదే ఆఖరిమాట.

శాస్త్రి—అలాగంటే వెళ్ళిపోతా ననుకుంటున్నారు కాబోలు. ఆంతవరకూ వస్తే ఇంట్లో చెంబూ చేటా ఉండవు. తెలిసిందా?

కృ—అదేదో చూద్దాం. కానివ్వండి.

శాస్త్రి—ఎప్పుడో కాదు, ఇప్పుడే చూస్తారు. (లోనికి అడుగు వెయ్యబోతాడు.)

కృ—లోనికి అడుగు పడిందా, మర్యాద దక్కదు.

ధర్మ—బాబూ! క్షమించి వెళ్ళిరండి. నేను.....

శాస్త్రి—ఉండవయ్యా! (అని ప్రక్కకు గెంటి, లోనికి వెళ్ళబోతాడు).

కృ—మళ్ళీ చెబుతున్నాను.

శాస్త్రి—ఏం చేస్తావయ్యా! (అంటూ లోనికి పోతాడు).

కృ—ఇదే చేసేది. (అంటూ మెడ పట్టుకొని వీధిగుమ్మంవద్దకు త్రోసేస్తాడు).

శా. స్త్రి—ఆ! ఆ! మెడపట్టుకొని గెంటుతావా! జంకిపోతాననా! (గాళ్ళీ ముందుకు వస్తాడు.)

కృ—ఛీ! ఛీ! అవతలకిపో! (అంటూ తిరిగి గట్టిగా త్రోస్తాడు)

[ధర్మయ్యా వారించచూస్తాడు. వీలుకాకపోతే కృష్ణుని తోసేస్తాడు.
శాస్త్రి క్రింద పడిపోతాడు.]

శాస్త్రి—బాబోయ్! వెంకన్నగారూ! శంకరయ్యగారూ! ఖూనీ!
బాబూ! ఖూనీ!

[ధర్మయ్య శాస్త్రిని లేవనెత్తుతాడు.]

కృష్ణ—నీతీ నిజాయితీ లేని పశువులట, పశువులు.

శంక—(తొందరగా వస్తూ) నడివీధిలో ఏమిటి యీ గల్లంతు?
(శాస్త్రివద్దకు వెడతాడు.)

శాస్త్రి—చూడండీ! ఈ రౌడీవెధవలు!

కృష్ణ—(కోపంగా) ఏమన్నావు? రౌడీవెధవలా? ఎవరురా రౌడీ
వెధవలు? (శాస్త్రిమీద కురుకుతాడు.)

[ఉష అన్నంతో వచ్చి శంకరయ్యను చూచి తిరిగి వెళ్ళిపోతుంది.]

శాస్త్రి—ఆ! ఆ! ఆ! (అంటూ భయంతో తప్పుకుంటాడు).

కృష్ణ— మళ్ళీ మాట జారేవా, పళ్ళురాలిపోగలవు. జాగ్రత్త!

ధర్మ—కృష్ణా! (అని హెచ్చరిస్తాడు).

శంక—(కృష్ణపక్కగా వచ్చి వీపుపై తట్టి) కొంచెం శాంతించ
వోయి నాయనా!

కృ—(చటాలున వెనుదిరిగి) శాంతం! ఏమిటూ శాంతం? ఎక్క
డుంటుంది? ఎలా ఉంటుంది? చెప్పగలరా?

ధర్మ—కృష్ణా! (తిరిగి హెచ్చరిస్తాడు.)

అంతా రోజుల మాహాత్మ్యమే!

శంక—ఉద్రిక్తపడక ప్రశాంతంగా......

కృ—మళ్ళీ అదేమాట? శాంతం, ప్రశాంతం! చేతగాని మాటలు. అర్థంలేని శాంతం! ఎన్నాళ్ళీ శాంతం?

శంక—తొందరపడి ఏమీ సాధించలేవు.

కృష్ణ—తొందరపడక సాధించేదేమిటో చెప్పండి. కూడుగుడ్డలకు మొగంవాచి, చాలీచాలని జీతాలతో, ఎండు డొక్కలతో, చావలేక బ్రతుకుతూఉన్న మా అస్థిపంజరాలను కూడా ఈ రాబందులు పీక్కుతింటూంటే, ఎన్నాళ్ళు శాంతంగా ఉండాలో చెప్పండి.

ధర్మ—కృష్ణ?

కృష్ణ—మాపరిస్థితులలో మీరే ఉంటే.........

ధర్మ—చిన్న పెద్ద లేకుండా మాట్లాడుతున్నావు కృష్ణా!

శంక—(నిదానించి) అబ్బాయి! ఈ చేతకానిశౌర్యాలు కట్టిపెట్టి బ్రతుకు తెరువు తెలుసుకో. ఎట్టి ఆపదలో ఉన్నా, ఉద్రిక్తపడక శాంతంగా.........

కృష్ణ—ఆపరిస్థితి మీకూ వస్తే ఆ శాంతం బయటపడేది.

శంక—శాంతం పరమభూషణం, ఉత్తములకుగాని నాయనా!

కృష్ణ—అహా! అలాగా?

ధర్మ—బాబూ! వాడితో మీకేమిటి? క్షమించి.........

శాస్త్రి—(లేచి) క్షమించాలా? క్షమిస్తాము, క్షమిస్తాము.

శంక___అసలు నీకు బుద్ధిలేదయ్యా, శాస్త్రీ!

శా___ఏమండీ!

శం___సొమ్ము వసూలుచేసుకొనే మార్గమిదా?

శాస్త్రి___మర్యాదగా అడిగితేనే......

శంక___అనవసరంగా మాట్లాడకు. ముందునడు.

ఉష___(తిరిగి ఉషవచ్చి శంకరయ్య వెనుక నిలబడుతుంది.)

ధర్మ___బాబూ! పొరబాటయింది. క్షమించండి.

శాస్త్రి___(కోపంగా ముందుకు నడుస్తూ) సాగదీసి లెంపకాయ కొట్టాక క్షమించేదేమిటయ్యా!

శంక___(వెనుకనున్న ఉషనుచూచి) ఏమిటీ చోద్యం చూస్తున్నావు? నడు.

[ ఉష ముందుకు నడుస్తుంది.]

కృష్ణ___(ఆలోచించి ఉషకొంగు పట్టుకొని లాగుతాడు.)

ఉష___ఆ! (అని కెవ్వుమంటుంది.)

శం___ఏరా! ఫూల్! బుద్ధిలేదు. (కృష్ణని గట్టిగా కొడతాడు.)

కృష్ణ___(వికటంగా నవ్వుతూ) కొంగుపట్టుకొన్నంత మాత్రానే కోపంవచ్చిందే. ఇక ఈరాబందులు మమ్మల్ని పీక్కుతింటుంటే......

అంతా రోజుల మహాత్మ్యమే!

ధర్మ—కృష్ణా! (మందలిస్తాడు.)

శంక—ఉషా! (కోపంగా నిష్క్రమిస్తాడు.)

కృ—శాంతమట. శాంతం.

[ వికటంగా నవ్వుతూంటాడు. తెరపడును. ]

# మూడవ రంగము.

[ వెంకన్న కాపు యిల్లు. వెంకన్న కాపుది పాతిక ఎకరాల సొంతసాగు ఉన్న రైతుకుటుంబం. ధాన్యానికి గిరాకీ రావడంతోనే, వెంకన్న కూడ ధనాశవల్ల, శంకరయ్య చెప్పుడుమాటలువిని సొమ్ము సంపాదించడం ప్రారంభించాడు. అయినా రైతుకుఉండవలసిన శాంతం, న్యాయదృష్టి, అతనిలో పూర్తిగా నశించిపోలేదు. ప్రకాష్ అతని ఏకైకపుత్రుడు. పట్నంలో వ్యవసాయశాఖలో డిగ్రీపొంది, రెండుసంవత్సరాలయింది. పట్నవాస జీవితాని కలవడిన ప్రకాష్‌కు పల్లెజీవితం వెగటుగాఉంది. విదేశాలకువెళ్ళి, ఇంకా ఏదో పెద్దడిగ్రీ సంపాదించాలని అతని ఆశయం. పాశ్చాత్యనాగరికత, వేషభాషలందు అతనికి అభిమానం. అందువల్లనే, అతను ఎప్పుడూ సెక్సుపత్రికలు సినీమాపత్రికలు, ఇంకాఎంతో అమెరికా సారస్వతం, చదువుతూ ఉంటాడు. విదేశీయ పద్ధతిలోనే కులాసాగా, జీవితం గడపాలని అతని ఆశయం. కాని తండ్రిమాట కాదనలేక, చేసేదేమీలేక, పల్లెజీవితం గడుపుతూఉన్నాడు. ఆపల్లెలో, అతనికి కాలక్షేపం అంతా శంకరయ్యకూతురు ఉషతోనే. ఇరుగుపొరుగుల ఇళ్ళుకావడంవల్ల తరచూ కలుసుకొంటూ, ఎరమరికలు లేకుండా, ఎంతో చనువుగా మసలుతున్నారు. ఆచనువుతోపాటు అనురాగంకూడా వారిలో లేకపోలేదు. ఇరువురి తండ్రులు వారిస్నేహానికి, అభ్యంతరము చెప్పలేదు సరికదా, సంబంధం కలుపుకుందామన్న అభిప్రాయంలో ఉన్నారు. అయితే ఎప్పటికప్పుడే ఏవో ఆటంకాలవల్ల పెళ్ళి జరగడంలేదు.

ఒకరోజు ఉదయం ఎనిమిదిగంటలవేళ. ప్రకాష్ గదిలోకూర్చుని కాఫీత్రాగుతున్నాడు. ఆగదిలో ఒకప్రక్క చిన్నబల్ల. దానిపైన అట్టతో

అంతా రోజుల మాహాత్మ్యమే!

చేసిన బొమ్మరిల్లుఉంది. అక్కడే కొన్నిప్లాసులు, కాగితాలు ఉంటాయి వానిప్రక్కనే ఒక పడకకుర్చీ, రెండవప్రక్కను మరియొక చిన్నబల్ల, దాని పైన ఏవో ఇంగ్లీషుపుస్తకాలు, ప్రక్కనే మనీపర్సు, సిగరెట్టుపెట్టె ఉన్నాయి. అక్కడకూడ ఒకకుర్చీఉంది. గదిమధ్య రెండుకుర్చీలు ఒకదానికొకటి ఎదురుగా ఉంచి, కాఫీత్రాగినతర్వాత, సిగరెట్టుపెట్టె ముట్టించి కులాసాగా పొగవదలుతూ, జార్లపడి, పాడుకుంటున్నాడు. పాట అవుతూాంటగానే రామం వస్తాడు.]

రామం—వన్సు మోర్! బావగారూ! వన్సు మోర్!

ప్రకా—నో మోర్ ప్లీజ్! నో మోర్!

రామం—అద్భుతంగా పాడేరండి బావగారూ!

ప్రకా—నువ్వుసర్టిఫై చేశావన్నమాట.

రామం—నేనేగాదు. మెడకాయమీద తలకాయఉన్న ప్రతీజీవి ఆమోదించవలసిందే?

ప్రకా—మాటలు నేర్చావురా!

రామం—ఏదో మీబోట్ల ఆశీర్వాదముంటే.....

ప్రకా—ఆ! ఉంటే.

రామం—నేనూ ఒక మంత్రినవనుటండి!

ప్రకా—ఓరి! చవట! మంత్రిపదవి అంటే ఏమిటనుకుంటున్నావు!

రామం—అబ్బో! నాకు తెలుసునండోయి! ఆతంతు. ముందు గట్టిగా బల్లగుద్ది మాట్లాడడం నేర్చుకోవాలి. దాని

తో పదిమంది నా వెంట బడతారు. ఆ దెబ్బతో మహా నాయకుడ నౌతాను. ఇంక చూడండి. ఏ పేపర్లో చూచినా, ఎవరి నోట విన్నా నా పేరు మారు మ్రోగిపోతుంది. దానితో నాకొక పార్టీ. నేనొక నాయకుణ్ణి. ఎలక్షనులో గెలుస్తాను. మరి మంత్రి కాకపోతానూ!

ప్రకా___ఆలోచనలు చాలా పెద్దవే ఉన్నాయి.

రామం___మన బుర్ర తక్కువది కాదండీ, చదువంటే లేదుకాని, సప్తసముద్రాల్ని కలిపే స్కీము వెయ్యగలను.

ప్రకా___నీబోటి మహానాయకులు దొరికితే దేశం బాగుపడినట్లే.

రామం___ఎవడికోసం! దానంతట అదే బాగుపడుతుంది.

ప్రకా___దేశంమాట ఏమైనా మీరు బాగుపడతారు.

రామం___మాతోబాటు దేశం. దేశం అంటే మేం. మేం అంటే దేశం.

ప్రకా___అప్పుడే నాయకుడనై నట్లే పోజిచ్చి మాట్లాడేస్తున్నావు

రామం___అనుకోకుండా ఆటోమేటిక్‌గా అలా వచ్చేస్తుందండి.

ప్రకా___నీజాతక ప్రభావం.

రామం___అంతేలెండి! అంతే. ఏజ్యోతిష్కుడు చెప్పినా ముందు మహాయోగం పట్టబోతూందని చెప్తున్నారు.

ప్రకా___అందరికీ మహాయోగాలనే చెప్తారు జ్యోతిష్కులు.

రామం___అలా కాదండి. మనది రాజయోగం. ముద్రాధికారం ఉందన్నారు.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ప్రకా—ఒరేయ్! నీకునిజంగా అంత యోగంపడితే నాకేమిటిరా బహుమానం.

రామం—మీకా. నాపర్సనలు శెక్రటరీ ఉద్యోగం.

ప్రకా—ఛీ! ఛీ! వెధవఉద్యోగాలు.

రామం—మీకుకావలసినన్ని ఇళ్లు, భూములు, సొమ్ము.

ప్రకా— వి అసలొద్దు.

రామం—(ఆలోచించి) సినీమాలకి, నాటకాలకి ఫ్రీగా పంపేస్తాను.

ప్రకా—ఏడవలేకపోయావు.

రామం—అదంతా కాదండి. ఆఫ్రికాకు పెద్దవిమానంలో పంపించేస్తాను.

ప్రకా—ఆఫ్రికా కాదురా! అమెరికా.

రామం—అదే ఆఫ్రికా ప్రక్కనేగా అమెరికా! నాకుతెలుసు.

ప్రకా—నీకు తెలియని దేమీ లేదు.

రామం—థేంకు యు! బావగారూ! థేంకు యు! మీరొక్కరు వ్వారు ఆమాట. ఏదీ ఒక సమిధి.

ప్రకా—అహా! సిగరెట్లు......

రామం—అలవాటై పోయిందండి. మానాలంటే కష్టంగా ఉంది. (టేబిల్ మీద సిగరెట్టుపెట్టె తీసి, ప్రక్కనున్న మనీపర్సు తీసి) బావగారూ! పర్సు పైన వదిలేశారే?

ప్రకా—ఫరవాలేదు. నీలాంటి దొంగలెవరు మాయింట్లో లేరులే.

రామం—నాన్సెన్సు ఎంతమాటన్నారు. మనం ఆపని మానేశా మండీ.

ప్రకా—పోనీలే! బాగుపడ్డావ్.

రామం—పడ్డంకాదు. పడిపోయాను. (సిగరెట్టుకాలుస్తూ, సెక్సు జర్నల్ చూస్తూ)

ప్రకా—అలాంటి పుస్తకాలు కుర్రవాళ్లు చదవకూడదూ! పాడై పోతారు. (తీసుకొంటాడు)

రామం—అవి మీబోటి పెద్దవాళ్లు వాడవడానికా......

ప్రకా—ఏడిశావు. విషయం తెలుసుకొని బాగుపడడానికి.

రామం—తెలియనివిషయం ఏముందండీ అన్నీ బూతుబొమ్మలే.

ప్రకా—అంతకన్న నీకింకేమి తెలుస్తుందిలే.

రామం—పోనీలెండి. అదేదో మీరే తెలుసుకొని బాగుపడండి. (రెండవవైపుచూచి) అదేమిటి "నయాఘర్" బలే బాగుందే.

ప్రకా—అదే మనం కట్టబోయే యింటినమూనా.

రామం—అబ్బా! అబ్బా! ఇల్లుకట్టుకొని, పెళ్ళిచేసుకొని, చల్లగ కాలం గడవాలోయ్.

[ తెరలో బాబయ్యా! బాబయ్యా! ]

ప్రకా—చూడు, రామం ఎవరో. (అని చదువుకుంటున్నాడు.)

రామం—(వెలుపలికివెళ్ళి, తిరిగివచ్చి) పేపర్లకుర్రాడట. సొమ్ము కోసం వచ్చాడు.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ప్రకా—సరే! ఆపర్సుతీసి అయిదురూపాయిల నోటిచ్చి మిగతా చిల్లర పుచ్చుకో. (తిరిగి చదువుతూంటాడు)

రామం—(పర్సుతీసి, అదనుచూచి, ఒక అయిదురూపాయిల కాగితం జేబులో దాచేస్తాడు. పర్సు అక్కడఉంచి, వెలుపలికివెళ్ళి, తిరిగి చిల్లరతోవచ్చి) ఇదిగో! మూడురూపాయిలు తీసుకొని రెండురూపాయ లిచ్చాడు.

ప్రకా—ఆచిల్లర పర్సులోనేఉంచి ఇలాఇయ్యి.

రామం—(చిల్లర పర్సులోఉంచి, పర్సు ప్రకాష్కిస్తాడు.)

ప్రకా—(చదువుతూ ఉంటాడు.)

రామం—సరే మీరు చదువుకోండి. నేనుపోతాను.

ప్రకా—(పుస్తకం చదువుతూనే) ఉండరా! కూర్చో.

రామం—అబ్బే, చిన్నపనుందండీ?

ప్రకా—పడిశేవు. నీకు పనేమిటి? కాఫీ తెప్పిస్తాను, కూర్చో.

రామం—మళ్ళీ వస్తానుగా. (అంటూ లేస్తాడు.)

ప్రకా—పోనీలే, యీ రెండణాలు (అని పర్సు తీస్తాడు.)

రామం—(దొంగతనం బయల్పడుతుందేమోనని భయపడతాడు. కాని ప్రకాష్ అది గుర్తించడు.) అబ్బే, ఎందుకండీ? ఎందుకండీ? (తంగారు పడతాడు.)

ప్రకా—తీసికొని కాఫీ త్రాగు. (అని రెండణాలిచ్చి పర్సు మూసేస్తాడు.)

రామం—(గుండె కుదుటపరచుకొని) మరి వస్తాను. (చరచరా
వెళ్ళిపోతాడు.

[ ప్రకాష్ సిగరెట్టు అంటించి తిరిగి చదువుతూ ఉంటాడు. లోనుండి:
పదిరూపాయల చిల్లర ఉందా! బావా! ]

ప్రకా—(పుస్తకం దింపి) పదిరూపాయిల చిల్లరా! లోపలికిరా
ఇస్తాను.

ఉష—(చేతిలో పదిరూపాయిల కాగితంతో వస్తుంది.) అర్జంటు
అవతల పేపర్లకుర్రాడు నిలుచున్నాడు.

ప్రకా—ఆడవాళ్ళుకూడా పేపర్లు చదువుతూంటేనే......

ఉష—గడ్డం తిరిగేయి రోజులు. అవునా.

ప్రకా—(పర్సుచూచి) అరె! మరొక అయిదురూపాయిల కాగి
తం ఏదీ?

ఉష—బాగుంది, ఇదొక ఎత్తా?

ప్రకా—అబ్బె నిజంగానే! ఇందులో మూడు అయిదురూపా
యల నోట్లు ఉంచాను. అందులో ఒకటి తీసి చిల్లర
మార్చమని రామంచేతికి......

ఉష—పర్సు యిచ్చావా? అయితే ఆనోటు...

ప్రకా—వాడే తీసేడంటావా?

ఉష—ఇంకా సందేహమా?

ప్రకా—ఆరి దొంగవెధవ! చూస్తూండగా చమకాకొట్టేడు.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ఉష—ఇంతకూ చిల్లర ఉందా లేదా?

ప్రకా—ఎంత కావాలి?

ఉష—పేపర్ల వాడికి మూడురూపాయ లివ్వాలి.

ప్రకా—ఇదిగో, ఈమూడురూపాయలు తీసుకెళ్ళు. (అని యిస్తాడు.)

ఉష—(తీసుకొని) నోటు మార్చి పంపిస్తాలే.

ప్రకా—పంపించడం కాదు. నీవే పట్టుకొని రావాలి.

ఉష—అదే పని నాకు.

ప్రకా—రాకపోయావా?... (ఉష వెళ్ళిపోతుంది.)

[ప్రకాష్ మళ్ళా సిగరెట్టు ముట్టించి పుస్తకం చదువుతున్నాడు. కొంత సేపటికి ఉష తిరిగివస్తుంది.]

ఉష—ఇదిగో నీ మూడురూపాయలు.

ప్రకా—నీ గాజులచేతితో ఆపర్సులో ఉంచేద్దూ.

ఉష—బాగుంది (అని పర్సులో సొమ్ము ఉంచుతుంది) ఇదిగో పర్సు చూచుకో.

ప్రకా—రాముంలా నీవు దొంగతనం చేయలేదుకదా.

ఉష—అందుకే చూడమంట (అని వెళ్ళబోతే)

ప్రకా—(లేచి) అయ్యో! అంతతొందర కూర్చోండి, దొరసాని గారూ! కూర్చోండి. (అని కూర్చుండచేయబోవ)

ఉష—దొరసానేమిటి! దొంసాని. (అని కూర్చుంటుంది.)

ప్రకా—పోనీ, ఉషాదేవిగారూ !

ఉష—నన్నేమీ మన్నన చేయనక్కరలేదు.

ప్రకా—అహా ! ఆడవాండ్రుకదండీ ? కొంచెం మర్యాదగా మాట్లాడకపోతే మాట దక్కదు.

ఉష—అహా !

ప్రకా—ఆ !

ఉష—ఆడవాళ్ళంటే అంత భయపడుతున్నారా మగవాళ్ళు ?

ప్రకా—భయమా? గజగజ వణకిపోతూంటే? మీసోదరీమణేగా మిత్రరాజ్యసమితి అధ్యక్షపదవి నలంకరించింది.

ఉష—ఇన్నాళ్ళకి ఆడదంటే అర్థమయిందన్నమాట మీకు.

ప్రకా—ఇప్పుడు కాదు. ఎప్పుడో అర్థమయింది, ఆడదాని శక్తికి అడ్డం లేదని. కాని...

ఉష—కాని...

ప్రకా—ఎక్కడో అక్కడక్కడ చెదిరి వేళ్ళమీద లెక్కించ కొద్దిమంది ఉన్నారు కాని, అక్షరాలు రాని ఆడవాళ్ళు ఎక్కువ.

ఉష—అందువల్లనే మీరు ఇంకా మొగవాళ్ళు మంటూ మాట్లాడడానికి వీలవుతోంది.

ప్రకా—కాకపోతే నోటికి తాళాలు వేస్తారన్నమాట.

ఉష—ఏమి చేస్తారో అలా చూస్తూ ఉండండి.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ప్రకా—చూచినతరువాత ఇంక ఉండనక్కరలేదు. సన్యాసం పుచ్చుకోని...

ఉష—మాట్లాడితే సన్యాసం మీా మగవాళ్ళకి...

ప్రకా—ఆడదాని పెత్తనంలో ఉన్న మగవాడికదే శరణ్యం.

ఉష—అలా ఎందుకవాలి? సవ్యంగా సంసారం దిద్దుకోకూడదూ?

ప్రకా—సవ్యం, అపసవ్యం ఆడదానికి అర్థమయితేనా?

ఉష—అర్థమయేలా చెప్పాలి.

ప్రకా—అర్థమయేలా చెప్పాలి? మరి నేను చెప్తుంటే నీవు వింటున్నావా?

ఉష—ఏమిటి వినాలి?

ప్రకా—మనమాట...

ఉష—ఎప్పటిమాటే!

ప్రకా—ఎన్నాళ్ళు యీావాయిదాలు?

ఉష—కోర్టువారికి అవసరమని తోచినన్నాళ్లు.

ప్రకా—కేసువివరాలయినా చెప్పుకోడానికి అవకాశము ఎప్పుడో అని.

ఉష—వివరాలు వింటే వెంటనే నిర్ణయం చెప్పమంటారుగా?

ప్రకా—వాయిదాలు వేస్తూపోతే తీర్పుచెప్పడం తప్పుతుందా?

ఉష—తప్పనిసరి వచ్చేవరకు.

ప్రకా—ఇప్పుడిక తప్పనిసరే. చెప్పితీరాలి.

ఉష—బలవంతమా ?

ప్రకా—కాదు. ప్రార్థన.

ఉష—ప్రార్థనలు స్వీకరించడానికి నేనేమీ దేవతను కాదే ?

ప్రకా—దేవతవే ! నాహృదయానికి దేవతవు. ఉషా ! నిజంగా నీవు లేకపోతే ఈపల్లెలో నే నొకనిమిషంకూడా ఉండ లేను !

ఉష—పట్నవాసంలో అయితే నే నక్కరలేదన్నమాట.

ప్రకా—ఇక్కడా, అక్కడా కాదు. ప్రతీచోట, ప్రతీనిమిషం నీవు నావెంట నీడలా ఉండాలి. ఏమంటావు ?

ఉష—కాదనను. కొన్ని షరతు లున్నాయి.

ప్రకా—ఏం చెయ్యమంటావు చెప్పు.

ఉష—పట్నవాసంపై వ్యామోహం వదలి నీవు నాతోపాటు పల్లెప్రజల శ్రేయోభివృద్ధికి నడుంకట్టాలి.

ప్రకా—అంటే ?

ఉష—అంటె అమెరికా, గిమెరికా అంటూ అడియాసలతో కాలం వృథాపుచ్చక, నిర్మాణకార్యక్రమానికి ముం దడుగువేయాలి.

ప్రకా—అంటే ?

ఉష—అంటే సూట్లు, బూట్లు వేసుకొని, కుర్చీలో కూర్చుని కబుర్లు చెప్పడం మాని, ప్రజలవద్దకు వెళ్ళాలి. వాళ్ళ

అంతా రోజుల మాహాత్మ్యమే!

కష్టనష్టాలు తెలుసుకోవాలి. వాళ్ళ శ్రేయోభివృద్ధికి శక్తివంచనలేకుండా కృషి సాగించాలి. పల్లెజీవితం సాభాగ్యవంతం చేయాలి.

ప్రకా—అబ్బో! చాలా ఉందే నీ ప్రోగ్రాం.

ఉష—ఇప్పుడేమి ఉంది? ఆచరణలో ఇంకా ఎన్నో కష్టనష్టాల నెదుర్కోవాలి. ఆలోచించుకో.

ప్రకా—ఉషా! ఆలోచించవలసిందంతా ఇదివరకే అయిపోయింది. ఇక నీ ఆశయాలతో ఏకీభవించడమే నా నిర్ణయము.

ఉష—అవంత తేలికకాదు. మనం వెళ్లేది పూలబాటకాదు.

ప్రకా— ముళ్ళబాటయినాసరే, నేను సిద్ధం.

ఉష—విదేశాభిమానం నిన్ను విడుస్తుందా?

ప్రకా—నీకోసం, నీ ప్రేమకోసం, ఏమయినా చేస్తాను. ఇవిగో! చూచావా, నాప్లానులు. (అని ఇల్లున్న బల్లదగ్గరకు వెళ్ళుతాడు.)

ఉష—ఇంటిచమూనాకూడా తయారయింది. ఇదంతా...

ప్రకా—నీకోసమే. ఏమేమో ఊహాగానం చేశాను. ఈనాడు నీ ఆంతరంగికాభిప్రాయము తెలిసికొన్నాక, నా ఆలోచనలన్నీ తారుమారయాయి. ఇక నిన్ననుసరించడమే నా నిశ్చయం.

ఉష.___నిశ్చయానికి నిలకడ ఉంటుందా ?

ప్రకా.___సందేహించకు ఉషా! నమ్ము నామాటల్ని. ప్రమాణం చేస్తున్నాను. (అని చేయిపట్టుకుంటాడు)

ఉష.___నిజంగానా.

ప్రకా.___నిస్సందేహంగా.

ఉష.___అవసరమయితే న్యాయంకోసం కన్నతండ్రినికూడ కాద నవలసివస్తుంది. తెలుసా ?

ప్రకా.___అంతవసర మేముంటుంది ?

ఉష.___న్యాయం నిలబెట్టడంకోసం.

ప్రకా.___న్యాయంకోసమైతే సిద్ధమే.

ఉష.___అయితే యీనాటినుండి నీతండ్రి చర్యలను నీవు ఖండించాలి.

ప్రకా.—అదేమిటి.

ఉష.—అదే మనమొదటిపని. మామయ్య నాన్నతోకలసి బ్లాకు మార్కెటు వ్యాపారం చేస్తున్నాడు.

ప్రకా.—బ్లాకుమార్కెటు వ్యాపారం ?

ఉష.—అవును అదే ప్రజలకు న్యాయంగా దక్కవలసింది, దక్క నీయక వారినోటివద్దది తన్నుకొనిపోయి తమపొట్టలు నింపుకొనే దొంగవ్యాపారం. ఆలోచించు, దీనివల్ల ఎన్ని కుటుంబాలు నాశనమవుతున్నాయో. ఎందరు అన్న

మో రామచంద్రా అని అలమటించిపోతున్నారు. ఇది న్యాయమంటావా ?

ప్రకా—నేనింతవరకు చాలా అజ్ఞానంలో ఉన్నానన్నమాట.

ఉష—అవును. ఇంటిపరిస్థితులు ఏమీ పట్టించుకోక, తండ్రి సంపాదిస్తూఉంటే చీకూచింతా లేకుండా, సాధించలేని ఆశయాలతో, గాలిలో మేడలుకడుతూ సోమరిజీవితం గడుపుతున్నావు.

ప్రకా—ఉషా! నాతండ్రికూడా ఇంతటి అన్యాయానికి సిద్ధపడ్డాడా!

ఉష—నీతండ్రి, నాతండ్రి సలహాపైనే.

ప్రకా—నిదర్శనం.

ఉష—వేరే నిదర్శనం కావాలా! ఈమధ్యనేకొన్న కొత్త భూములు ఎలా వచ్చాయనుకున్నావు?

ప్రకా—ఈ బాపతం సొమ్మేనన్నమాట.

ఉష—చూడు ప్రకాష్! మన పొరిగింటి ధర్మయ్యగారి కాపురం.

ప్రకా—మన బడిపంతులు ధర్మయ్యగారేనా!

ఉష—ఆయనే! ఆకుటుంబపరిస్థితి నాహృదయాన్ని కలచివేస్తుంది. ఉన్నదంతా ఊడ్చి పెళ్ళాం రోగంకోసం ఖర్చుపెట్టినా, మాటదక్కక ఆమె చనిపోయింది. ఇప్పుడు పిల్లలతో చాలీచాలని జీతంతో, పాతకొత్త అప్పులు తీర్చేమార్గం కనబడక బరువుగా బ్రతుకు సాగిస్తున్నారు. పొరుగింట్లో

రోజూ వస్తువులతో చస్తూంటే, మనం కడుపునిండా తిని,
కులుకుతూ కూర్చుంటె క్షేమముంటుందా!

ప్రకా—అలాఅని ఎంతమందిని కనికరించగలం?

ఉష—కనికరించాలి. దేశమంతా ఒకకుటుంబంగా భావించాలి. ఆర్థికసమానత్వం సాధించాలి. ఇరుగుపొరుగుల క్షేమం మనక్షేమం అని తెలుసుకోవాలి.

ప్రకా—నిన్నుచూస్తుంటె నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. కొద్ది విజ్ఞానంతో, ఎంతో విషయాన్ని తెలుసుకొని, ఏమేమో సాధించాలని ముందు కురుకుతున్నావు. ఇది సాధ్యమా?

ఉష—ఆ అధైర్యంవద్దు. మనం దీక్షతో ఉద్యమం ప్రారంభిస్తే సాధించలేనిది ఉండదు.

ప్రకా—భోగవిలాసాలతో కులుకుతూ ఉండవలసిన యువతివి. నీకింత రాజకీయ విజ్ఞానం—పేపర్లమహాత్మ్యమే! ఆడవాళ్లను చదివించడం గొప్పప్రమాదమే.

ఉష—ప్రమాదాన్నరికట్టడానికే, ఆడదానికి చదువుకావాలి.

ప్ర—నీవిజ్ఞానప్రబోధము, నాకు జ్ఞానోదయం. ఆవెలుగులో విధ్యుక్తధర్మాన్ని తెలుసుకుంటాను. నా సోమరి జీవితానికి సిగ్గుపడుతున్నాను. నీఆశయాలతో, ఆదర్శాలతో ఏకీభవించి కృషిచేస్తాను. అందుకు మనయిద్దరి అంతరాత్మలే సాక్షి.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ఉష—చాలా ఆనందం.

ప్రకా—నీ ఆనందమే నా ఆనందం. (ఇరువురి చేతులు అనుకోకుండా కలుస్తాయి).

[ముందు వెంకన్నకాపు, వెనుక శాస్త్రి వస్తున్నారు. కిర్రుచెప్పుళ్ళ శబ్దం వినబడగానే ఉషా ప్రకాష్‌లు కొంచెం ఎడంగా నిలబడతారు.]

శాస్త్రి—ఇందులో మళ్ళీ అబద్ధమా? (అంటూ లోనికి వస్తారు.)

వెంక—అబ్బెబ్బె! మీరు అబద్ధం ఆడేరనికాదు.

ఉష—చిల్లర మొట్టిందికాదూ? వస్తాను మరి.

ప్రకా—నేనూ వస్తానుండు. (అని యిరువురు ఒకరివెనుక ఒకరు వెడతారు.)

వెంక—ఏం వెళ్ళిపోతున్నావేమమ్మా?

ఉష—మళ్ళీ వస్తాను. (అంటూ వెళ్ళిపోతుంది)

[శాస్త్రి కొరగా చూస్తుంటాడు. వెంకన్నకాపు వచ్చి కూర్చుంటాడు.]

శాస్త్రి—ఇందులో మళ్ళీ అబద్ధమా? ఖర్చుపెట్టేనండీ రెండు పచ్చకాగితాలు.

వెంక—అబ్బెబ్బె! మీరు అబద్ధమాడేరనికాదు. (కుర్చీలో కూర్చుని) బాగానే వుంది యీవ్యాపారం. అందరికీ తలో పిడికెడూ! ఇక చేతికి వచ్చేది మామూలు రేటే!

శాస్త్రి—అదేమిటండీ! అలాగంటారు? రెండుచేతులతోనూ సంపాదించే వ్యాపారం! ఒక్కపట్టున ఇంతలాభం!

వెంక__ఏంలాభాలో ? నాకేమో గుండె కొట్టుకుంటూంది.

శాస్త్రి__అనుభవం చాలక. స్వయంగా బేరమివ్వడం యిదే మొదటిసారిగా !

వెంక__చెయ్యక చెయ్యక కకూర్తిపనిచేశాను. మరేం ప్రమాదం రాదుకదా !

శాస్త్రి—ఏప్రమాదం రాకుండగానే కదూ! రెండు పచ్చకాగితాలు ఖర్చుపెట్టేం.

వెంక__ఈపాటికి బస్తాలు వెళ్ళిపోయాయంటారా ?

శాస్త్రి—ఇంతవరకూనా! రాత్రికిరాత్రే చేరిఉంటాయి. మీ మీద ఈగవాలకుండా చూచేభారం మాది. సరా !

వెంక__అంతా ఆభగవంతుడిదే భారం.

శాస్త్రి—దేవుడిభారం మోసేది మనం. మన భారంమోసేది దేవుడు. అంతే. (ప్రకాష్‌వచ్చి చాటుగా నిలబడతాడు.)

వెంక__ఇంతకూ యీబుద్ధి ఎందుకుపుట్టిందో !

శాస్త్రి__మీయినప్పెట్టెలు పూర్తిగా నిండడానికి.

వెంక__ఇనప్పెట్టె నిండుతుందో. ఇల్లే కూలుతుందో. ఎవరికి తెలుసు.

శాస్త్రి__మీకు తెలియకపోయినా నాకు తెలుసు. మీరు త్వరలో కొత్త యినప్పెట్టె కొనితీరవలసిందే.

వెంక__సరే ! చూద్దాం.

అంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—కలవా మరి.

వెంక—చిత్తం.

శాస్త్రి—మరి ఆ రెండువందలు...

వెంక—ఆ! ఇస్తాను. ఇదిగో (అని నోట్లు చేతికందిస్తాడు).

(ప్రకాష్ ముందుకి వస్తాడు)

శాస్త్రి—వెళ్ళివస్తా.

వెంక—చిత్తం. (శాస్త్రి వెళ్ళిపోతాడు).

వెంక—ఎంతవరకు వెళ్ళావయ్యా?

ప్రకా—మీవిషయం తెలుసుకోనేంతవరకూ.

వెంక—అవేం మాటలు?

ప్రకా—అవును నాన్నా! నీవు కోపగించక అడిగినదానికి సమాధానం చెప్తావా?

వెంక—ఏమిటది?

ప్రకా—శాస్త్రి మనయింటికి వచ్చిన కారణం...

వెంక—అదా? ఏదో అవసరముంది.

ప్రకా—తరుచు వస్తున్నాడేం?

వెంక—అవును, పనుంటే రాడూ?

ప్రకా—అదే. ఆపనేమిటో నేను తెలుసుకోవచ్చా?

వెంక—అది నీకనవసరం.

ప్రకా—అవసరం వచ్చింది కనుకనే అడుగుతున్నాను.

వెంక—తిరువాత మాటలాడుకుందాం గాని ముందు నీవు పొలం లోకి పోయి ఆ, రామిగాడ్ని సంతకు పోయివచ్చేడో, లేదో కనుక్కో.

ప్రకా—రామిగాడు ఇందాకనే వెళ్ళేడు సంతకి. మరి ఈశాస్త్రి సంగతి...

వెంక—చెప్పేవా మరి కోడెదూడని బేరం చెయ్యమని.

ప్రకా—ఆ, చెప్పేను. కాని ఈశాస్త్రివిషయం ?

వెంక—మళ్ళీ అదే ప్రసక్తా ? తర్వాత మాటలాడుకుందా మన్నానుగా ! ఎందుకీతొందర ?

ప్రకా—కొంపలో నిప్పు రాజుకుంటూంటే తొందరగాక తీరు బడా నాన్నా !

వెంక—కొంప చక్కబెట్టుకునేవాడిని నేనుండగా, నీకెందుకు ఈ తాపత్రయం ?

ప్రకా—మనకొంప చక్కబెడుతున్నారు. పొరుగుకొంపలు కూల్చేస్తున్నారు.

వెంక—నువ్వెప్పుడు నేర్చుకున్నావీపెద్దమాటలు ?

ప్రకా—ఈరోజే! ఇంతకు కొన్ని నిమిషాలముందే. మీరు చేస్తున్న అన్యాయాన్ని తెలుసుకోగలిగాను.

వెంక—ఓహో! అదా ! మేం వచ్చేసరికి ఉష నీవూ మాట్లాడే రాజకీయం. ఆడదాని మాటలువింటే మొగాడు బాగుపడినట్లే.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ప్రకా___న్యాయంచెప్పే ఆడదానిమాటలు పెడచెవిని పెట్టినా అంతే.

వెంక___కుర్రతనం. పాలుపొంగే యౌవ్వనం. మీకేమి తెలుస్తుంది. సంసారభాధ్యత; సొమ్ముమిలువ.

ప్రకా___అలాగని అన్యాయార్జితం చేస్తారా! నాన్నా!

వెంక___అసలు న్యాయంఅంటే ఏమిటి? మానవసృష్టిలోనే న్యాయంలేదు. పరమలోభికే కావలసినంత ఆస్తి, పరమ పతివ్రతకే వ్యభిచారిమగడు. పరమ దరిద్రుడికే గంపెడు పిల్లలు. నిజాయితీగా నిలబడేవాడికే నిందలు. దానికేమంటావు?

ప్రకా___సృష్టిలో చెడుగేకాని మంచినెందుకు తీసుకోరు. స్వార్థపరత్వం, ధనలాభం మనల్ని పెడదారి త్రొక్కిస్తుంది. మనం రైతులం. రైతంటే దేశానికి వెన్నెముక. రైతే మేడిపట్టకపోతే ప్రజలు మాడిచావవలసిందే. అట్టి రైతే ఎంగిలికూడు కాశించి తోటిసోదరుల కడుపులు కాలుస్తుంటే ఏంచేయాలి? పండించేవాడు మొదలు పాలించేవాడువరకూ ఈదొంగసొమ్ము కాసిస్తే ఎందుకీ ప్రజారాజ్యం!

వెంక___నిజమే! అవన్నీ ఆలోచించే నిజాయితీగా చాలాకాలం వృధాచేశాను. చూడు, ఇరుగుపొరుగు పూరిగుడిసెలు,

భవనాలు అవుతున్నాయి. కానీకి విలువచేయనివాళ్ళు కార్లు కొంటున్నారు. పూటకు గతిలేనివాళ్ళు పూటుగా ఖజానాలు నింపుతున్నారు. ఇది అన్యాయార్జితమని అందరికీ తెలుసు. కాని వారినే తెలివైనవాళ్ళుగా ప్రజ్ఞావంతులుగా సంఘం గౌరవిస్తోంది. మనంకూడ అలా ఎందుకు కాకూడదూ? ఎన్నాళ్ళిలాగ అప్రయోజకులై ఉండగలము.

ప్రకా——దొంగ దొరకనంతసేపు ప్రయోజకుడే! జైలుయాత్రకు బయలుదేరేనాడు కనిపిస్తుంది వాడి ప్రయోజకత్వం.

(పోలీసు ఇనస్పెక్టరు ఇద్దరుపోలీసులతో వస్తాడు.)

ఇన—కాపుగారూ, కాపుగారూ!

వెంక—(ఆశ్చర్యం, భయం) ఎందుకు బాబూ!

ఇన—మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను. (అని పోలీసులకు ఆజ్ఞ ఇస్తాడు).

వెంక—నన్నే అరెస్టు?

ప్రకా—నేరం.

ఇన—బ్లాకుమార్కెట్టు వ్యాపారం.

ప్రకా—ఆధారం?

ఇన—దొరికిన బస్తాలు. ఊ. రండి నాతో స్టేషనుకు. (వెంకన్న కాపు మాటలాడలేక భయంతో వణకిపోతాడు. కళ్ళు

అంతా రోజుల మాహాత్మ్యమే!

వెంట నీళ్ళు కారుతున్నాయి. పోలీసులు చేతులకు బేడీలు తగిలిస్తారు.)

ప్రకా—ఇనస్పెక్టరుగారూ! (అని యేదో చెప్పబోతాడు.)

ఇన—నా చేతిలో ఏమీలేదు. కేసు రిజస్టరు అయింది. ఇంక కోర్టువారిదే అధికారం, అంతే.

ప్రకా—ఈనేరంలో భాగం ఉన్నవాళ్ళనందరినీ అరెస్టుచేశారా?

ఇన—చెప్పండి. ఇంకా ఎవరున్నారో?

ప్రకా—చెప్పు నాన్నా, నిజం చెప్పు.

వెంక—(గద్గదస్వరంతో) చెప్పేదేమీలేదు నేరం చేసాక.

ప్రకా—నీ కాదుర్బోధ చేసినవాళ్ళనుకూడా బయటపెట్టు.

[అంటూండగా శాస్త్రి వస్తాడు. పోలీసులను చూచి ముందడుగు వెయ్యాక చటాలున తప్పించుకొనిపోతాడు.]

వెంక—వినేవాడికి తెలివిలేకపోతే చెప్పేవాడి తప్పేముంది? నా నేరానికి నేనే బాధ్యుణ్ని.

ఇన—ఆయన చెప్పదలచుకొన్నదుంటే కోర్టువారి సమక్షంలో చెప్పుకోవచ్చు. జామీనుమీద విడుదలకానూవచ్చు. ఇంకా చాలా ఉంది తంతు. నడవండి, నడవండి.

ప్రకా—ఇనస్పెక్టరుగారూ! మీరునిజంగా ఈ కేసులో న్యాయం జరిగించాలంటే, ఆ శాస్త్రి శంకరయ్యలనుకూడ అరెస్టు చేయాలి. వాళ్ళే ఇలాంటి నేరానికి కారకులు. వాళ్ళ మద్దతువల్లనే.....

ఇన—మిస్టర్! మా డ్యూటీ మాకు తెలుసు.

వెంక—నాయనా! ఆవేశపడి ఆగ్రహించకు. ఆగ్రహం అపాయ కరం.

ప్రకా—ఈ అపాయాలు అమాయకుల కేనా!

ఇక—రండి! కాపుగారూ రండి!

వెంక—నాయనా! (అని మాట్లాడలేక)

ప్రకా—(దీనంగా )నాన్నా!

వెంక—కక్కూర్తి పనిచేసాను. మనవంశానికి రైతులోకానికి పెద్ద మచ్చ తెచ్చాను. శిక్ష అనుభవించ పోతున్నాను. విచా రించకు. చచ్చిన తల్లి, బ్రతికివున్న ఈతండ్రి ఒక్కటే. యోగముంటె తిరిగి (ఇకమాట్లాడలేక అశ్రుధారగా విల పిస్తాడు.)

ప్రకా—(దుఃఖాన్ని దిగమ్రింగడానికి ప్రయత్నించి విఫలుడై) నాన్నా! నాన్నా! (అంటూ ఏమీ తోచక తండ్రితో దుఃఖిస్తాడు.)

ఇన—కాన్‌స్టేబుల్సు! అలా చూడండీ! ఆజనం! చూస్తూ ఊరు కున్నారా చెదరగొట్టండి! (కానస్టేబుల్సు అలాచేస్తూ ఉంటారు) మిస్టర్ ప్రకాష్! మీరూ విచారిస్తున్నారా!

[ వెంకన్న, ప్రకాష్ అలా నిలబడిఉన్నారు. తొందరగా ధర్మయ్యా, కృష్ణ, ఉష వస్తారు. ]

అంతా రోజుల మాహాత్మ్యమే!

వెంక—(ధర్మయ్యతో) ధర్మయ్యన్నా!(ఏమీ చెప్పలేక ఏడుస్తాడు)

ధర్మ—ధైర్యం వహించు. మంచి ప్లీడరుని పెట్టి వాదిద్దాం.

ఇన—రండి! రండి! (అని తొందరచేస్తాడు వెంకన్న కావు దుః

ఖిస్తూ, విడువలేక, చివరకు ఇల్లు విడచిపోతాడు. ప్రకా

ష్ ఏమీతోచక ఒకకుర్చీలో కూలబడతాడు.)

కృష్ణ—ఇదేనాడో నేననుకున్నదే.

[ధర్మయ్య, ఉష, ప్రకాష్‌కు చెరియొక ప్రక్క నిలబడతారు].

ధర్మ—జరిగినదానికి విచారించక జరగవలసింది ఆలోచించు నా

యనా!

ప్రకా—(ఉద్రిక్తంగా లేచి) ఆలోచించాను. ఆ శాస్త్రి, శంకర

య్య దొంగలు. మోసం చేసారు. శిక్ష నాతండ్రికి

గాదు. వాళ్ళకే! నేనే విధిస్తా. (అంటూ కర్రతీసికొని

ముందుకు పోబోతాడు.)

ధర్మ—(ఎదురునిలచి) ఇది అవివేకులు చేసేపని. వద్దు, హింసా

విధానం వద్దు.

కృష్ణ—చచ్చేం. మళ్ళా వేదాంతబోధ. (అని వెళ్ళిపోతాడు.)

ప్రకా—అడ్డు లేవండి. నన్నాపవద్దు.

ఉష—(వెనుకనుంచి) ప్రకాష్! మన ఆదర్శాన్ని మరచిపోతు

న్నావు. ఆగ్రహం అపాయకరం సుమా-

ధర్మ—అవును. ఆగ్రహం అపాయకరం-

ప్రకా—ఆగ్రహం అపాయం! అంతా అదేమాట, అంతా అదే మాట!

ధర్మ—అదే బాపూజీ సందేశం. వద్దు రక్తపాతం చేయవద్దు. అంతా మూర్ఖుల మవవద్దు. నిదానంగా కర్తవ్యాన్ని నిర్ణయించుకుందాం.

ఉష—అవును. నిదానంగా కర్తవ్యాన్ని నిర్ణయిద్దాం.

ప్రకా—అంతా అదేమాట. అదేమాట. (అని కుర్చీలో కూర్చుంటాడు.)

[ తెర ]



# నాలుగవ రంగము.

---

[శంకరయ్యగారి ఇల్లు. రెండు మూడు కుర్చీలు, టేబిలు, బట్టలస్టాండు ఉన్నాయి. శంకరయ్య విసుగ్గా ప్రవేశిస్తాడు. వెనుక శాస్త్రి ఉంటాడు.]

శంక___వెధవలు గర్భదరిద్రపు వెధవలు. (కోటువిప్పుతుంటాడు.)

శాస్త్రి___చిత్తం. చిత్తం. అంతేనండి. (కోటు పుచ్చుకొని స్టాండుని ఉంచుతాడు.)

శంక___నోటికొచ్చినట్లు పేలడం. చేతి కొచ్చినట్లు వ్రాయడం. ఇదేగా మనకొచ్చేది. (కుర్చీలో కూర్చుని అలసటను సూచిస్తాడు)

శాస్త్రి___చిత్తం. చిత్తం. పనిపాటలు మాని ప్రచారమంటూ ప్రబోధమంటూ, కేకలు వేసుకుంటూ, అరపులు అరుస్తూ, అచ్చోసిన ఆంబోతుల్లాగ తిరగడం, అలవాటయి పోయిందండి.

శంక___మనం దేశద్రోహుల మట. ఈ వెధవలంతా దేశ సేవకులట.

శాస్త్రి___చిత్తం. చిత్తం. అంతేనండి.

శంక___ఏమిటంతే. నీమొహం.

శా స్త్రి—అదేనండి. వాళ్లు దేశసేవకులు. మనం......

శంక—ఛీ! ఛీ! నోరుముయ్యి. నువ్వూ అమాంటే?

శా స్త్రి—క్షమించాలి. పొరబాటు. వాళ్ళు దేశద్రోహాలు.

శంక—కాకపోతే, అన్నం, పున్నెం, ఎరుగని అమాయిక ప్రజలను రెచ్చగొట్టి ఇష్టమొచ్చినట్లు ఆడిస్తారా?

శా స్త్రి—చిత్తం. చెప్పేవాళ్ళకు బుద్ధిలేదు. వినేవాళ్ళకు బుద్ధి లేదు.

శంక—నీకోటి ఏడిసిందా?

శా స్త్రి—ఏమండి?

శంక—నీమొఖమండి. కాకపోతే ఆకోర్టుదెబ్బ కాస్త గట్టిగా తగలనిస్తే మళ్ళీ వాడలాంటి తప్పుడుపనులు చేస్తాడా?

శా స్త్రి—అదృష్టవంతుడు అయివుండి బతికిపోయాడు. కాని మరొకడైతే ఆదెబ్బకు.

శంక—సరేలే. అసలు ఇలాంటివాటికి నిన్ను పురమాయించడం నాదే తప్పు.

శా స్త్రి—మీరాలాఅంటే నేనేం మాట్లాడను.

శంక—మాట్లాడవద్దు. ఏడవావద్దుకాని, కాసిని మంచినీళ్ళు పుచ్చుకో.

శా స్త్రి—చిత్తం. చిత్తం. (లోనికి పోతాడు)

శంక—ఉస్. అబ్బ గొప్పచిక్కు వచ్చింది.

అంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—(మంచినీళ్ళు తెస్తాడు).

శంక—(నీళ్లు చూచి) నీతెలివి తెల్లవారనూ. మంచినీళ్ళంటే మంచినీళ్ళే?

శాస్త్రి—మరిలేకపోతే!

శంక—అమ్మాయి నడిగి కాఫీ పట్టుకురావద్దూ?

శాస్త్రి—చిత్తం, చిత్తం. అమ్మాయిగారింట్లో లేరండీ!

శంక—లేదూ? ఎక్కడికి వెళ్ళింది?

శాస్త్రి—అక్కడికేనండి.

శంక—అక్కడికంటే!

శాస్త్రి—ఆప్రకాష్‌దగ్గరకేనండీ.

శంక—ఆ! ఆవెధవ ఇంటికే?

శాస్త్రి—చిత్తం, చిత్తం. ఆమె ఆయిల్లు విడవటం లేదండీ.

శంక—తండ్రివిరోధి కూతురుకి ప్రాణస్నేహితుడు!

శాస్త్రి—నేను చాలసార్లు చెప్పేనండి, నాన్నగారికి మీ ప్రవర్తన నచ్చటంలేదని.

శంక—నచ్చినా నచ్చకపోయినా నాధోరణి నాదే అందా?

శాస్త్రి—చిత్తం,చిత్తం. నేనంటే కొరకొరలు చిరచిరలు ఎక్కువయాయండీ.

శంక—ఇదంతా ఆముష్టివెధవ ప్రకాష్‌గాడే చేస్తున్నాడు. మా శోక్యంలాంటి పిల్లను మాయలో పడేసుకొని, నీమీద, నామీద, ఇంటిమీదకూడ అసహ్యం కలిగించాడు.

శాస్త్రి—చిత్తం, చిత్తం. ఇదంతా వాడి మాయేనండీ.

శంక—కాకపోతే కన్నతండ్రినే ధిక్కరించే ధైర్యం వాని కెక్కడిది? కత్తిగట్టాడు నామీద. ఇంటా బయటా మహాగ్ని రగుల్కొలుపుతున్నాడు. ఈ అగ్నిలో వాడే మాడిపోతాడో, నేనే మాడిపోతానో......

శాస్త్రి—అవేమిమాటలు సార్! మాడిమాడి వాడే మసిబొగ్గవుతాడు కాని......

[ఇంతలో శంకరయ్యగారూ, శంకరయ్యగారూ! అని కేక వినబడుతుంది.]

శంక—ఎవరో చూడు.

శాస్త్రి—(చూచి వచ్చి) ధర్మయ్యగారు.

శంక—సరే. నీవు లోపల పనిచూచుకో.

శాస్త్రి—(వెళ్ళిపోతాడు)

శంక—రండి మేష్టరుగారూ! రండి. (ఎదురు వెళతాడు)

ధర్మ—(లోనికి వస్తాడు)

శంక—కూర్చోండి! మేష్టరుగారూ! కూర్చోండి.

ధర్మ—చిత్తం. (కూర్చుంటాడు.)

శంక—మేష్టరుగారి కీమధ్యను తీరిక లేనట్టుంది.

ధర్మ—తమకు తెలియందేముంది. బడిపంతులు ఉద్యోగానికి తీరికా ఉండదు. పనీ ఉండదు!

శంక—పనిలేకపోవడమేమిటి! ఏదో అభ్యుదయసంఘమని స్థాపిం

అంతా రోజుల మాహాత్మ్యమే!

చారుట. ఆసంఘానికి మీారు సలహాదారు, మీాఅబ్బా యి శ్రీకటకే. ఆప్రకాష్ ప్రెసిడెంటుటగా.

ధర్మ—ఆసంఘం, దాని కార్యక్రమంతో నాకేమీా సంబంధం లేదు.

శంక—మీా సలహాలమీాదనే అంతా......

ధర్మ—నాసలహాపాటించేదెవరు? నావేదాంతం ఎవరికి నచ్చుతుంది?

శంక—మీాఅబ్బాయికి సంబంధముందిగా.

ధర్మ—ఉంటే ఉండవచ్చు.

శంక—కొడుకు తప్పుదారిని పడుతూంటే సరిదిద్దడం, మీాబాధ్యత కాదా!

ధర్మ—కడుపునిండా అన్నంపెట్టలేని తండ్రిని ఏకొడుకు లక్ష్యపెడతాడు.

శంక—అలా వదిలేయడం రాబోయే పరిణామాలకు సిద్ధపడేనా.

ధర్మ—రానున్నది రాకమానదు. అంతా రోజులమాహాత్మ్యమే.

శంక—శాస్త్రి ఆనాడు బాకీ వసూలుకోసంవస్తే తన్ని త్రోసివేసినాడు. మధ్యవర్తిత్వానికి వచ్చిన నన్ను, మర్యాదగా సాగనంపేడు. ఈనాడు నన్ను పూర్తిగా నాశనం చేయడానికే ప్రయత్నిస్తున్నాడు. ఇవన్ని తాహతు తెలిసి ఉండి చేసేపనులేనా!

ధర్మ—ఎవరి తాహతు వారిది.

శంక—మేష్టరుగారి కొడుకని, ఇన్నాళ్లు ఓపికపడుతున్నాను. లేకపోతే ఈకుర్రకుంకలు నాకొకలెఖ్ఖా !

ధర్మ—మీరు సర్వసమర్థులని ఎవరికి తెలియదు.

శంక—ఆవిషయాన్ని మీవాడికి చెప్పండిమరి.

ధర్మ—చెప్తే వినేస్థితిలో లేడు.

శంక—ఈ పరిస్థితుల్లో, మీరీఊళ్లో కాపురం చెయ్యడం కష్టం.

ధర్మ—ఈశ్వరేచ్ఛ ఎలాగు ఉందో !

శంక—వేదాంతాలతో రోజులు గడపడం కష్టం. సంసారిగా ఉం డదలచినవాడు, తెలివిగా సంపాదించుకొని, సుఖపడడం నేర్చుకోవాలి.

ధర్మ—సుఖదుఃఖాలు దైవనిర్ణయాలు. అవి మన చేతుల్లోలేవు.

శంక—మాట్లాడితే వేదాంతం. శాస్త్రి మీమీదవేసిన దావా డిక్రీ అవుతుంది. ఇంట్లో ఉన్న చెంబూచేటాకూడా బాకీక్రింద జప్తు చేస్తారు. అపుడీ వేదాంతం మిమ్మల్ని రక్షిస్తుందా ?

ధర్మ—బాబూ ! పరువుగా బ్రతకాలనే ఆశించాను. ఇన్నాళ్లు ఆ పరువు ప్రతిష్టలకోసం ప్రాకులాడాను. ఈనాడా పరువు ప్రతిష్టలు నడివీధిపాలయితే నాజీవితనాటకానికి సమాప్తి అవుతుంది.

శంక—వేదాంతం వెర్రిగా మారుతోంది. ఉన్న ఉద్యోగం కూడా ఊడిపోతే......

అంతా రోజుల మాహాత్మ్యమే!

ధర్మ—శనే నిరగడై పోతుంది. నిశ్చింతగా చావవచ్చు.

శంక—చావంత తేలికగా లేదు. తెలుసా!

ధర్మ—భోగభాగ్యాలలో ఆశ ఉన్నవాడికి కష్టం. కాని విరాగికది కష్టంలేదు.

శంక—ఇంత వేదాంతం చెప్పేబదులు సన్యాసం పుచ్చుకొని ఏ అరణ్యంలోకో పోకూడదూ!

ధర్మ—అడవులలోనికిపోతే అప్పుల బాధ తప్పుతుందా! అంతకన్న చావే మేలు.

శంక—ఆత్మహత్య ప్రయత్నంకూడా అపరాధం తెలుసా!

ధర్మ—చావక బ్రతికిఉంటేగా ఆ అపరాధానికి శిక్ష.

శంక—చావు పురుషలక్షణం కాదు.

ధర్మ—బ్రతుకు భారమైతే చేసేదేమిటి?

శంక—ఇంక మీకు చెప్పేదికూడా ఏమీలేదు. ఆఖరిమాట వినండి. వాళ్ళు, వీళ్ళు బాగుపడ్డారని ఏడుస్తూ, ఈ వెర్రి మొర్రి వ్రాతలు, కూతలువల్ల ఏమీ సాధించలేరు. బ్రతుకు తెరువు తెలుసుకొని పెద్దలతో పేచీ పడకుండా సఖ్యతగాపోతే వాళ్ళూ బాగుపడగలరు. మీసంఘంలోని వారందరికి ఇదే నా సందేశంగా చెప్పండి.

ధర్మ—నేను చెప్పవలసినదంతా ఇదివరకే చెప్పేను. అయినా మీమాటగా చెప్పిచూస్తాను. ఆపైన దైవాధీనం.

శంక—దైవాధీనమంటే లాభంలేదు. మీరు ఆ క్షుద్రశక్తులను, అదుపు ఆజ్ఞలలో పెట్టకపోతే మీకూ, వాళ్లకీ నష్టం తప్పదు. మరచిపోకండి.

శర్మ—మా రోజులమాహాత్మ్యం ఎలాగుందో !

శంక—ఈ దెబ్బతో అదే తేలాలి.

శర్మ—ఊ ! కానివ్వండి. ఈశ్వరేచ్ఛను ఎవరు మార్చగలరు. మరి శెలవు.

శంక—మంచిది.

(ధర్మయ్య వెళ్లిపోతాడు.)

శంక—పిచ్చి వేదాంతి.........

శాస్త్రి—(లోనుంచివస్తూ) అంతా దైవాధీనం. రోజుల మాహాత్మ్యం.

(ఇంతలో ఉష వస్తుంది. తండ్రిని, శాస్త్రిని చూస్తుంది. ఆగకుండా లోనికి పోతుంది)

శంక—ఉషా !

ఉష—ఏంనాన్నా ! (దగ్గరగా వస్తుంది. శాస్త్రి ప్రక్కకు తప్పుకుంటాడు.)

శంక—ఇప్పటికి గుర్తుకొచ్చిందా ఇల్లు.

ఉష—నాయిల్లు నాకెప్పుడూ గుర్తే నాన్నా !

శంక—టైమెంత అయిందో తెలుసా !

ఉష—ఆలస్యమయింది నిజమే.

అంతా రోజుల మాహాత్మ్యమే !

శంక___ఇంతవరకూ ఎక్కడున్నావో తెలుసుకోవచ్చా ?

ఉమ___నీకు తెలియకుండా ఉందా!

శంక___నాకేకాదు. లోకులందరికీ తెలుసు; నీ వెక్కడుంటు న్నావో, ఏం చేస్తున్నావో !

ఉమ___లోకం కన్నుకప్పి సంచరించాలనే ప్రయత్నం నాకులేదు.

శంక___అయితే లోకం వార్తి స్తుందనే. పొగరుబోతు వెధవతో...

ఉమ___పరనింద వద్దునాన్నా !

శంక___అబ్బ ! అభిమానం పొడుచుకువచ్చింది. ఈ అభిమానం లో నూరవవంతు తండ్రిమీద ఉంటే.

ఉమ___నీయందు నా కభిమానం....

శంక___ఉండబట్టే నాకు గర్భశత్రువుతో ఏకమవుతున్నావు.

ఉమ___నీకతడు శత్రువెందు కయ్యాడు ?

శంక___కాదూ! నన్ను ప్రత్యక్షంగానూ, పరోక్షంగాను ఎదిరిస్తు న్నాడు. అయింది కానిది ఆధారంగా తీసుకొని, కారు కూతలుకూసి ప్రజలను నామీద రెచ్చగొడుతున్నాడు. చేతికొచ్చిందల్లా వ్రాసి, ప్రభుత్వానికీ, నామీద మహా జరు పిటీషన్లు పంపుతున్నాడు. ఎలాగైనా నా నాకొంప కూల్చాలని ప్రయత్నం చేస్తున్నాడు.

ఉమ___మీరుమాత్రం వదిలేరా ! ఉన్నది లేనిదికూర్చి పోలీసు రిపోర్టు లిస్తున్నారు. రౌడీలను, గుండాలను పురమా యించి ప్రాణాలకే మోసం....

శం:___నోర్మయ్యి! ఎందుకెందుకని ఊరుకుంటుంటే నెత్తి కెక్కుతున్నావు.

ఉష___ఆ ఉన్నమాటంటె నీకంత కోపమెందుకు నాన్నా!

శంక___కోపంకాదు. నాపాపం యిలా బ్రద్దలైనందుకు ఏడ వాలో, నవ్వాలో అర్థంకావడంలేదు. లేకపోతే ఒక్క గాని ఒక్క కూతురు అదీ కత్తికట్టాలీ!

ఉష___నాన్నా! నీమీదనేను కత్తి కడతానా! తల్లిలేని లోటు లేకుండా, అల్లారుముద్దుగా నన్నులాలించి, ఆడించి, పెంచి, పెద్దదాన్నిచేశేవే! నోరార "అమ్మా" అని పిలవడానికి నోచుకోకపోయినా "నాన్నా" అని పిలవ డానికి, నీవున్నావని సంతోషించడానకి బదులు నీచెడుగు కోరి, నిన్నుకాదని నేను సంచరిస్తానా!

శంక___(గద్గదస్వరంతో) నేనుమట్టుకు అలా అనుకొన్నానా! ఏదో కోపావేశంలో అంటానుగాని, నాకు తెలియదు నీ తత్వం. ఎటువంటి మహాఇల్లాలి కడుపున పుట్టేవు. ఆ ఇల్లాలు ఈఐశ్వర్యాన్ని, ఆనందాన్ని, అనుభవించనపో యినా, అమెమూర్తిని, నీవైనా అనుభవిస్తావనేగా నాయీ తాపత్రయమంతా. తల్లిలేని పిల్లవి. నీకేలోటు లేకుండా చేయడానికే నాక్లేశమ.

ఉష___నాకు మట్టుకు ఎవరున్నారు చెప్పునాన్నా! తల్లిఅయినా

ఒంతా రోజుల మాహత్మ్యమే!

తండ్రికి యినా అన్నీ నీవేగా. నీసుఖం, నీగౌరవం, నీప్రతిష్ఠ నిల్పడమేగా నాకర్తవ్యం.

శంక___మాబంగారుతల్లి. ఎంతచల్లనిమాటలు విన్నాను. (అని దగ్గరగా తీసుకొని సాదరంగా)

ఉష___నాన్నా! ఆవేశంలో నీ కెదురు చెప్తానేగాని నీమీద ప్రేమ లేకనా!

శంక___ఆహా! నాకు తెలియదూ! నాచిట్టితల్లి సంగతి. చూడమ్మా! ఇకముందా ప్రకాష్‌తో చేరకు. వాడింటికి వెళ్ళడం మానెయ్యి.

ఉష___మరి నీవీ బ్లాకుమార్కెటు వ్యాపారం మానేస్తావా!

శంక___మళ్ళీ మొదటికొచ్చావు.

ఉష___నేను మొదటినుంచీ అదే అంటున్నాను.

శంక___అయితే వాడితో స్నేహం మానవంటావు?

ఉష_మా స్నేహం శాశ్వతమైంది. పవిత్రమైంది.

శంక_చెడిపోతున్నావు సుమా!

ఉష_చెడిపోయే వాళ్ళను బాగుచేయడమే మా కృషి.

శంక_నా ఆస్తిలో ఒక పైసా అయినా దక్కదుసుమా.

ఉష_అన్యాయార్జితం నా కక్కరలేదు.

శంక_అన్యాయార్జితమా! అన్యాయార్జితమా!

ఉష_ఆ, ముమ్మాటికీ.

శంక_అయితే. పో. నాయింట్లో ఉండద్దు పో.

ఉష—(మాట్లాడదు.)

శంక—ఇంకా నుంచున్నావేం పో ! ఇది అన్యాయార్జితంగా ! పో! ఆ ముష్టివెధవ యింటికే పో.

(శాస్త్రి కంగారుగా వస్తాడు.)

శాస్త్రి—సార్ ! సార్ !

శంక—నీవు మాట్లాడకు శాస్త్రీ ! ఊ ! పో !

శాస్త్రి—ఇకి స్పెక్టరు రాజారావుగారొచ్చారండీ !

శంక—ఎవరు ?

శాస్త్రి—పోలీసు ఇనస్పెక్టరుగారు.

(ఉష లోనికి పోతుంది.)

శంక—పోలీసు యినస్పెక్టరు !

శాస్త్రి—మ రేనండి.

శంక—రమ్మను.

(శాస్త్రి రాజారావును తీసుకొనివస్తాడు.)

శంక—దయచేయండి. దయచేయండి. ఇనస్పెక్టరుగారు. (శాస్త్రి కుర్చీ వేస్తాడు.)

ఇ. రా—థేంక్సు. (అని కూర్చుంటాడు.)

శంక—శాస్త్రి ! చూడు. కాఫీ.

రాజా—వద్దండి ! వద్దు. ఇప్పుడే కాఫీ త్రాగివచ్చాను.

శంక—ఎన్నిసార్లు త్రాగితే వద్దంటుంది కాఫీ.

రాజా—ఎక్సుక్యూజు మి. నన్ను బలవంతము పెట్టవద్దు.

అంతా రోజుల మాహాత్మ్యమే!

శాస్త్రి—పోనీ పద్దై నా కూల్ డ్రింకు.

రాజా—అబ్బెబ్బె! ఏమీ వద్దండీ!

శాస్త్రి—ఏమిటో రాకరాక ఇనస్పెక్టరుగారొచ్చారు. మొగ మాటపడుతున్నారు.

శంక—మీారలా మొహమాటపడితే ఎలాగండి. మా యింట్లో డ్రింకు త్రాగినంతమాత్రాన మరేమీ ప్రమాదంరాదు లెండి.

రాజా—అభయం నాకెప్పుడూ లేదు.

శాస్త్రి—ఇనస్పెక్టరుగారినిగురించి అంతా చెప్పుకుంటున్నారండీ చాలా మంచివారని.

శంక—చెప్పకోరూ! బుద్ధిమంతులయినపుడు చాలా స్ట్రిక్టుగా పని చేస్తున్నప్పుడు......

రాజా—అది మా డ్యూటీ సార్!

శంక—ఇంతకూ మీారిపుడు డ్యూటీ మీాదే.

రాజా—మరేనండి. పోలీసు డ్యూటీమీాదే వచ్చాను.

శంక—ఆ! చూడు! శాస్త్రి! (అని లోనికి పొమ్మని సౌజ్ఞ చేస్తాడు. శాస్త్రి వెళ్ళిపోతాడు. ఇనస్పెక్టరు నుద్దేశించి) విషయం?

రాజా—చూడండి. ఈ మహాజరు పిటీషను. (కాగితాన్ని పైకి తీస్తాడు.)

శంక—ఎవరిమీద ?

రాజా—మీామీాదే.

శంక—నేనేదో ప్రజలను దోచుకుంటున్నానని, బ్లాకుమార్కెటు చేస్తున్నానని.........

రాజా—అదేనండి! అదే! ప్రజాభ్యుదయసంఘం తరఫునవ్రాసింది.

శంక—వాళ్ళపిండాకుడు సంఘం. అభ్యుదయం, ఆదర్శం అకలి మంటలు, ఈపదాలేగా వీళ్ళకి తెలిసినవి.

రాజా—ఇందులో శాస్త్రిఅని ఉంది. ఇందాక ఇక్కడ ఉన్నా యనేగా.

శంక—ఆ! అతనే.

రాజా—సరే! దీనిగురించి మీారేంచెప్తారు ?

శంక—చెప్పవలసినదంతా ఇందాక కలెక్టర్‌కి డి. యస్. పి. కి చెప్పివచ్చానులెండి. రేపోమాపో ఢిల్లీ వెడదామను కొంటున్నాను. అక్కడకూడా మాట్లాడి తగిన బందో బస్తు చేస్తా.

రాజా—అలాగే కానివ్వండి. కానీనన్ను కేస్ ఇన్‌వెస్టిగేషన్‌కి నియమించారు. అందువల్ల మీా స్టేట్‌మెంట్......

శంక—స్టేట్‌మెంట్ కేముందిలెండి. ప్రకాష్‌అని ఒకరైతుకొడుకు. వాడొక ఫిఫ్త్ కాలమిస్టు. వాడికిశిష్యుడు కృష్ణ. వాళ్ళా బశీపంతులుగా రబ్బాయి. వీళ్ళిద్దరే ఆప్రజాభ్యుదయ

సంఘానికి కార్యకర్తలు. ఏదో ఒకసాకుచెప్పి ప్రజలను రెచ్చగొట్టి, నానాభీభత్సం చేయడమే వారిలక్ష్యం. అంటే అర్థమయింది కాదూ: వాళ్ళేపార్టీవో!

రాజా—సరే! సరే! తెలిసిందిలెండి.

శంక—చూశారూ! యీమహానాయకులిద్దరూ, పదిమందిని వెంటవేసుకొని, చీటికి మాటికి ఉత్సవాలు ఉపన్యాసాలూ సాగిస్తూ, బుర్రలు బ్రద్దలుకొట్టడానికి, సొమ్ములు దోచుకోవటానికి గాదెలు కూలద్రోయడానికి ప్రజలను రెచ్చగొడతున్నారు.

రాజా—మరి యీరిపోర్టులో మీరే వాళ్ళని కొట్టించారని ఉంది.

శంక—నేచెప్పేది వినక, ఆతప్పాలతడక రిపోర్టుగురించి మాట్లాడుతారేమిటండీ, నేచెప్పేది రికార్డుచేయండి.

రాజా—సరే! కానివ్వండి.

శంక—మాబోటి మర్యాదస్తులు వీరి పోరుపడలేకుండా ఉన్నారు, ఇలాంటి వెధవల్ని, అముతాల్ని నాశనంచేయడం ప్రభుత్వం కర్తవ్యం. లేకపోతే ప్రజలు ప్రభుత్వం, నానా అగచాట్లు పడడం తప్పదు. వ్రాసేరా! అలాగ.

రాజా—ఓ! యస్.

శంక—అదే మీరు పైకి సబ్‌మిట్ చేస్తారుకదూ

రాజా—అంతే! మీ స్టేట్‌మెంట్ పై, నా ఇన్‌వెస్టిగేషన్ రిమార్కును వ్రాసి పంపుతా.

[ శాస్త్రి తిరిగి కూల్ డ్రింకు తీసుకొని వస్తాడు. ]

శాస్త్రి—ఇదిగో సర్!

రాజా—క్షమించండి. (లేచి) శంకరయ్యగారూ! శలవా!

శంక—ఆ! చూడండి ఇనస్పెక్టరుగారూ! మీరిమార్కెట్ జాగ్రత్తగా వ్రాయాలిసుమండి. బుద్ధిలేని ప్రజలు వాళ్ళేం చెప్పమంటే అదిచెప్తారు. వీళ్ళందరినీ సర్కసుమృగాలు లాగ ఆడిస్తున్నారు వాళ్ళు. అందుచేత కేవలం, యీ ప్రజల మాటమీద ఆధారపడక, మీ తెలివికూడా ఉపయోగించి పని జరిగించండి.

రాజా—సరేలెండి.

శాస్త్రి—డ్రింకు త్రాగకుండానే వెళ్ళిపోతున్నారు. పోనీ...

రాజా—ఏమీ వద్దన్నానుగా...

శంక—మీకవసరమయినపుడల్లా, నాసలహా సహాయం ఉంటుంది.

[ శాస్త్రికి కనుసైగ చేస్తాడు. ]

రాజా—శలవు. (వెళ్ళిపోతూంటాడు.)

శాస్త్రి—(వెనుకబడి) బాబు! ఇనస్పెక్టరుగారు! మీకిక్కడ నెయ్యి, పాలు మంచివి దొరకడం లేదేమో. పంపమంటారా?

రాజా—నాకలాంటివేమీ అక్కర లేదు.

శాస్త్రి—చూచారూ. బాబుగారిని ఏవిధంగా ఉపయోగించా

అంతా రోజుల మాహాత్మ్యమే!

లంటే, ఆవిధంగా ఉపయోగించుకోవచ్చు. వారి పలు

కుబడి ప్రతిష్ఠ......

రాజా—అబ్బ! తెల్సునయ్యా! నాకంతా తెలుసు. నీపని చూ

చుకో!

శాస్త్రి—చిత్తం, చిత్తం, అలాగే, అవసరమొచ్చినప్పుడల్లా

మీరు ...

రాజా—యు ప్లీజ్ మైండ్ యువర్ బిజినెస్. (వెళ్ళిపోతాడు.)

శాస్త్రి—చిత్తం. చిత్తం. (తిరిగి శంకరయ్యనుచూచి) ఇది గట్టి

పిండమే.

శంక—మనంమాత్రం గట్టివాళ్ళం కాదూ?

శాస్త్రి—చిత్తం, చిత్తం. (అని వెంటబడతాడు)

( తెర )



## అయిదవ రంగము.

[ శర్మయ్య యింటిలోగది. కొంచెం ప్రక్కగా ఉన్న కావడిపెట్టెపై కూర్చుని, కృష్ణ ఏకాగ్రతతో వ్రాస్తుంటాడు. తాను వ్రాసినది సవరించుకుంటు, మధ్యమధ్య నవ్వుకుంటున్నాడు. మాసినగడ్డం, చెదిరినజుట్టు, నలిగినబట్టలు, అతని కార్యదీక్షను చాటుతున్నట్లున్నాయి. ప్రకాష్ లోనికి వచ్చాడు. ఉషకూడా ఉన్నది. అతడు సామాన్యదుస్తులను ధరించి ఉన్నాడు. చేతిలో లెదర్ బేగ్ ఉంది.]

ప్రకా—(కృష్ణనుచూచి) అడ్డులేకుండా కలం చరచరా సాగిపోతుంది. ఏమిటి కొత్త విశేషం?

కృష్ణ—ఇదిగో కొత్త గేయం చూడు.

ప్రకా—(చదివి) భేష్! బలే ఘాటుగా ఉంది. గుండుదెబ్బకన్న ఎక్కువ నీకలంపోటు.

కృష్ణ—ఏదీ! ఉషా! ప్రారంభించు. కలసి పాడుదాం. (ముగ్గురు కలసి పాడుదురు.)

గేయం:

పదండి ముందుకు పదండి
పోదాం, పోదాం, పోదాం పైపైకి
యువతీయువకుల మంతా కలసి,
ఒకటేమాటతో, ఒకటేబాటపై ... ॥పదండి ముందుకు॥

అంతా రోజుల మాహాత్మ్యమే!

కృ॥ వేదాంతాలతో, వెర్రి కేకలతో,
వృథాచేయకండి, మనకాలం,
అంతా ఒకట్టై, అందరికోసం,
కండలువంచి, కష్టం పడదాం.

ప్రకా॥ ప్రజాద్రోహులకు పాఠంచెప్పుదాం,
ప్రజాబలం చవిచూపిద్దాం,
పాడిపంటలను వృద్ధిచేద్దాం,
పల్లెజీవితం సుఖమనిపిద్దాం.

ఉమ॥ కష్టానికి ఫలితందక్కే—
నీతీనియమం, ధర్మం తప్పని
నవసమాజ నిర్మాణం, మనలక్ష్యం,
సర్వోదయ సిద్ధాంతమె మనకాదర్శం.

కృష్ణ—భేష్! ప్రకాష్ నీగాననైపుణ్యం నాగేయానికి వన్నె
తెచ్చింది సుమా.

ప్రకా—సరే! నన్ను నీవు, నిన్ను నేను, అభినందించుకుంటే సరిపో
తుందా! ప్రజలు మెచ్చుకోవాలి.

కృష్ణ—అందుకేగా మనకృషి. అప్పుడే రేగిందిగా గాలిదుమారం.
కొమ్ములు తిరిగిన హేమాహేమీలంతా గగ్గోలు
ఎత్తి పోతున్నారు.

ఉష—(టైముచూచి) నాన్న వచ్చేవేళ అయింది. నేను వెళ్ళి వస్తాను. (అని పోవును.)

కృష్ణ—ఆ? మొన్న బుర్రకథలో ఏదో గల్లంతు జరిగిందట.

ప్రకా—మాబుర్రలు బ్రద్దలుకొట్టమని రౌడీల నేర్పాటుచేసాడా శంకరయ్యగారు.

కృష్ణ—ఆ! అయితే.

ప్రకా—మనవరకూ రాకుండానే అక్కడచేరిన పెద్దలు నలుగురు కలసి ఇది పసికట్టి అరౌడీలకి బుద్ధిచెప్పి పంపించేసారు.

కృష్ణ—దౌర్జన్యానికి దిగుతున్నాడన్నమాట శంకరయ్య.

ప్రకా—అంతేకాదు, అధికారవర్గాల్ని, కూడకట్టుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడట.

కృష్ణ—ఇవన్నీ చేస్తూనే మనతో రాయబారాలా?

ప్రకా—అదేగా వాళ్ళసిద్ధాంతం. ఒకవంక శాంతిప్రబోధం. మరొకవంక అటంబాంబుల తయారీ.

కృష్ణ—రోజులు మారుతున్నాయిలే. ఈదొంగదొరలను ప్రజలు గుర్తించగలుగుతున్నారులే.

ప్రకా—ప్రజలను మనం లోబరచుకొన్నామనే శంకరయ్య కా కడుపుమంట.

కృష్ణ—లోబరచుకోవడానికి మనమేం మాయచేస్తున్నామా?

అంతా రోజుల మాహాత్మ్యమే!

గారడీచేస్తున్నామా? విందులు వినోదాలు ఏర్పాటు చేస్తున్నామా? సంచులుకోసి లంచాలిస్తున్నామా?

ప్రకా—అవేమీ లేకుండానే బలం కూర్చుకుంటున్నామనే వారి భయం.

కృష్ణ—మనం కాకపోతే మరొకరిద్వారానైనా, ప్రజలు నిజం తెలిసికోకపోరు. ఆనాడు ప్రజావిప్లవం రాకతప్పుతుందా?

ప్రకా—అలా ఆలోచిస్తే యింతద్రోహము చేయగలరా? పల్లెలో తనమాటకు ఎదురులేదని గర్వించాడు.

కృష్ణ—పాపం! కాఫీ టిఫెనులిచ్చి, ధనాశచూపించి, అమాయక రైతులను మోసగించి, దొంగవ్యాపారాలతో కలకాలం కులుకుతూ ఉందామనుకున్నాడు. పాపం పండింది. నిజ స్వరూపాన్ని ప్రజలు తెలిసికొంటున్నారు. ఇక వీడికి పతనం తప్పదు.

ప్రకా—యీ ప్రజాచైతన్యానికి కారణం నీ రచనలే.

కృష్ణ—నారచనలక్ విలువ నిచ్చింది ఉష, నీవూ చేసే ప్రబోధం.

ప్రకా—నిజంగా ఈవిషయంలో ఉషదే పై చెయ్యి. ఆమెచొరవ ధైర్యము ఆఉత్తేజకరమైన ప్రసంగాలు, మనఉద్యమానికి ఎంతో బలమిస్తున్నాయి.

కృష్ణ—ఉషను నేనీనాటికి అర్థం చేసుకోగలిగాను.

ప్రకా—ఆమె ప్రబోధమే నాజీవితాన్ని సరిదిద్దింది.

కృష్ణ—ఆడదైనా ఇంత అమితోత్సాహంతో మనకు వెలుగు బాట చూపుతోంది. ఆబాట ననుసరించి అభ్యుదయాన్ని సాధించవలసిన బాధ్యత ఉంది.

ప్రకా—శక్తివంచన లేకుండా కృషిచేస్తున్నాం. ప్రభుత్వానికి ఈ దొంగనుతాను గురించి మహాజర్లు పంపించాము. పత్రికలద్వారా, ప్రసంగాలద్వారా,బుర్రకథలద్వారా, వాళ్ళ చర్యలను ప్రజలకు బోధిస్తున్నాము. ఆచోకితీసి, అదను చూచి పట్టుకోడానికి ప్రయత్నం చేస్తున్నాం. ఇంకేం చెయ్యాలి?

కృష్ణ—చాలు. పట్టుదలతో ఇలా ముందుకుపోతే చాలు.

[ ఇంతలో ధర్మయ్య వచ్చాడు. నిస్పృహ నిరాశలు ముఖంలో తాండవిస్తున్నాయి. అలా దిగులుగావచ్చి అక్కడఉన్న మంచం వాల్చుకొని మోకాళ్ళమీద, మోచేతులలో తలవంచుకొని కూర్చున్నాడు. కాస్సేపు నిశ్శబ్దం]

ప్రకా—(మెల్లగా దరిచేరి) ఎందుకీదిగులు మామయ్యా.

ధర్మ—(బరువుగా) చావలేక బ్రతికి ఉన్నందుకు!

ప్రకా—పెద్దవాడవు నీవుకూడా అలా అధైర్యం పడితే ఎలాగు?

ధర్మ—(నిట్టూర్పువిడచి, దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు)

ప్రకా—మనస్సు పాడుచేసుకుంటే మరింత ప్రమాదముంది. నీవే చెప్పేవాడవుగా "పరిస్థితులకు ఎదురీదడం పురుషలక్షణమని"

ధర్మ—ఒక్కనాడా! రెండునాళ్ళా! ఎన్నాళ్ళనీ దరిద్రబాధ.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ప్రకా—మంచిరోజులు రాకపోవు. ధైర్యం వహించు. (కృష్ణ వద్దకువచ్చి) మనసు గాయపడినట్లుంది. కొంచెం ధైర్యం చెప్పు. నేను మళ్ళావస్తా. (అని వెళ్ళిపోతాడు)

కృష్ణ—(మాట్లాడక ఏదో వ్రాసుకుంటూ ఉంటాడు.)

ధర్మ—(నిస్పృహతో లేచి ఇటు అటు తిరుగుతున్నాడు.)

కృష్ణ—(కొంతసేపటికి) దావా ఏమయింది?

ధర్మ—డిక్రీ ఇచ్చేరు. రేపోమాపో శాస్త్రి జప్తు నోటీసుతో మనయింటిమీద పడతాడు.

కృష్ణ—ఏంచేస్తాడు? ఈబొళ్ళసామానుకూడా పట్టుకొనిపోతాడు అంతే.

ధర్మ—(లేనినవ్వు తెచ్చుకొని) ఎంతతేలికగా అన్నావు కృష్ణా! పరువుప్రతిష్టలుపోయాక బ్రతుకు ఎందుకు.

కృష్ణ—ఇంతలో పోయిందేముంది. ఎవరెరుగరు? మన పరువు ప్రతిష్టలు.

ధర్మ—ఏంలాభం. అప్పులెగవేసేవాళ్ళని అందరికీ తెలిస్తే...

కృష్ణ—ఇకముందెప్పుడూ అప్పు యివ్వరు అంతేనా?

ధర్మ—ఆస్తిలేక, అప్పుపుట్టక యిక బ్రతికే దెలాగ.

కృష్ణ—ఉద్యోగం ఉందిగా.

ధర్మ—అదీ ఎప్పుడు ఊడిపోతుందో. ఊళ్ళో పెద్దలందరితోను విరోధము పెట్టుకున్నాము.

కృష్ణ—ఎవరా పెద్దలు? శంకరయ్య, శాస్త్రి యిలాంటి వాం
        వైభవలేనా ?

ధర్మ—అదిగో ఆనోటి దురుసే యింతవరకూ తెచ్చింది. అందు
        వల్లనే అందరికి విరోధమయ్యేం.

కృష్ణ—నాదురుసుతనమా ?

ధర్మ—నిశ్చయంగా! అదే శాస్త్రి, శంకరయ్యలను మనమీా
        దకు రెచ్చగొట్టించింది. అదే నాఉద్యోగాన్ని ఊడపెర
        కడానికి కారణమవుతుంది. అదే ఒక్కసారిగా అప్పుల
        వాళ్ళని రెచ్చగొట్టడానికి కారణమయింది. రేపోమాపో
        అదే మనబ్రతుకుల్ని నడివీధిపాలు చేస్తుంది.

కృష్ణ—అదిగాదు. మనం గొర్రెలంకాబట్టి, వాళ్లు యిష్టమొ
        చ్చినట్లు ఆడిస్తున్నారు. చూద్దాం. అదెన్నాళ్ళో ?

ధర్మ—అంతా నాశనమయ్యాకా చూచేదేముంది ?

కృష్ణ—కానున్నది కాకమానదు.

ధర్మ—(కృష్ణవైపు చూస్తాడు)

కృష్ణ—పెంచడం, చంపడం మనచేతుల్లో లేదు.

ధర్మ—(మరింత కోపంగా చూస్తాడు)

కృష్ణ—అంతా దైవాధీనం. అంతా రోజులమాహాత్మ్యమే.

ధర్మ—కృష్ణా !

కృష్ణ—మీారు చెప్పిన వేదాంతిమే.

అంతా రోజుల మాహాత్మ్యమే!

ధర్మ—అలాగని అయినవాడితోను, కానివాడితోను, కయ్యా నికి కాలుదువ్వతావా? బుర్రలు పగలగొట్టడానికి లూటీలు దోపిడీలు చేయడానికి సిద్ధపడతావా?

కృష్ణ—కాక, పెళ్ళిచేసికొని, పెళ్ళాన్ని పోషించలేక, సన్యాసం పుచ్చుకోవాలా? పిల్లలను కని, పెంచలేక కడుపునిండా తిండైనా పెట్టలేక బ్రతకండిరాఅని ఊరుమీద గాలికి వదిలేయగలమా? చేతనైనంత వరకూ అప్పులుచేసి తీర్చే మార్గములేక చివరకు ఏనుయ్యో, గొయ్యో చూసుకోగలమా?

ధర్మ—కృష్ణా!

కృష్ణ—అవసరం వచ్చిందికాబట్టి అడుగుతున్నాను చెప్పండి, మీ వేదాంతాలతో సాధించినదేమిటో? పరువు, మర్యాద, గౌరవములంటూ, లోకానికి, సంఘానికి జడసి అనవసరంగా, తాహతుకుమించిన అప్పులుచేసి, ఆస్తి అంతా అమ్మేసారు. అవసానకాలంలో పెళ్ళానికి మందైనా యివ్వలేక, ఆమె ప్రాణాలు పుచ్చుకొన్నారు.

ధర్మ—కృష్ణ, కృష్ణ (అని కంటినీరుతో దీనంగా అంటాడు.)

కృష్ణ—చాలీచాలని జీతంతో బడిపంతులు ఉద్యోగముచేస్తూ కన్నకొడుకుకు, కడుపునిండా అన్నమైనా, పెట్టలేక విద్యాసంస్కారాలులేని, తుంటరిగా తయారుచేసి వదిలేసారు. ఈనాడు.....

ధర్మ—కృష్ణ, కృష్ణ (యింకా దీనంగా అంటాడు)

కృ—న్యాయంకోసం నాతోబాటు దేశంలో అందరిక్షేమంకోసం అన్యాయాన్ని ఎదుర్కోవడం తప్పా? న్యాయాన్ని సాధించే ధైర్యంలేక, అంతా దైవాధీనం అంటూ అన్నిటికీ తలొగ్గి, సర్వనాశనం కావటం ఒప్పా? చెప్పండి. యిదేనా మీవేదాంతసారం? యిదేనా సంసారధర్మం?

ధర్మ—(అశ్రుధారగా గద్గదస్వరంతో) అవును. తప్పంతా నాదే. అసలే గాయపడిన గుండెను బ్రద్దలుకొట్టావు. కృష్ణా, కృష్ణా క్షమించు. (అని వలవలఏడ్చి తండ్రి ఫోటోను చూస్తాడు)

కృష్ణ—(మాట్లాడడు.)

[ ఇంతలో పురోహితుడు ప్రవేశం ]

పురో—పంతులుగారూ! పంతులుగారూ!

ధర్మ—(వచ్చేదుఃఖాన్ని దిగమ్రింగుకొని, మంచంమీద కూలబడతాడు)

కృష్ణ—(పురోహితునితో) ఏంబాబూ! ఏమిక్కొంపమునిగింది?

పురో—చిత్తం. చిత్తం. రేపు తమతాతగారి తద్దినం.

కృష్ణ—తద్దినమా.

ధర్మ—(వింటాడు)

పురో—చిత్తం. చిత్తం.

అంతా రోజుల మాహాత్మ్యమే!

కృ—మాతద్దినం ఎప్పుడు పెట్టిస్తారు ?

పురో—అలాగనడం ధర్మంకాదు.

కృ—తమరు మాకేమీ ధర్మాలు చెప్పవద్దు. మేము తద్దినం పెట్టం. పెట్టలేను.

పురో—పితృదేవతల కార్యం మానివేయడం...

కృ—ఎవరయ్యా ఆ పితృదేవతలు? ఎక్కడున్నారు?

పురో—తమరలా సెలవిస్తే...

కృ—మీరేమీ చెప్పవద్దు. దయవుంచి వెళ్ళండి.

పురో—ధర్మయ్యగారూ!

కృ—ఆ యన్ని పలకరించవద్దు. నేను చెప్తున్నానుగా, వెళ్ళిరండి.

పురో—శివ శివా! తండ్రితద్దినం పెట్టలేని దరిద్రపుకొంపగా మారిపోయింది. అంతా రోజుల మాహాత్మ్యం. (వెళ్ళిపోతాడు).

కృ—చస్తూంటే సంధిమంత్రం. బ్రతికున్నవాళ్ళకే తిండిలేక చస్తూంటె, చచ్చినవాళ్ళకి తిండెక్కడనుండి తెచ్చేది?

ధర్మ—(కళ్ళవెంట నీరు కారుస్తూ) యాభై సంవత్సరాలుగా నిరాటంకంగా పెట్టిన తండ్రితద్దినం. కన్నతల్లిదండ్రుల ఋణం తీర్చుకోడానికి ఏడాదికొకసారి గుక్కెడునీళ్ళు వదిలే దినం. ఆగిపోతోంది. ఇక చావక...

కృ—చచ్చినవాళ్ళకోసం మనం చస్తామా?...

ధర్మ—ఛీ! వెధవ్వ బతుకు. (అని తల బాదుకొని వలవలా ఏడు స్తాడు.)

కృ—(తండ్రి దుస్థితిచూచి కృష్ణగుండెకూడా కరుగుతుంది.) ఏడిస్తే ఏంలాభం నాన్నా! ఊరుకోండి. (అతని మోకా ళ్ళదగ్గరగా కూర్చుంటాడు.)

ధర్మ—కృష్ణా! కృష్ణా! చేతగాని తండ్రి...(ఏమిటో చెప్పబోయి చెప్పలేక ఏడుస్తాడు).

కృ—నాన్నా! నే నన్నానని బాధపడుతున్నావా ? ఆవేశంలో తెలియక...

ధర్మ—కాదు. నిజం చెప్పావు. చచ్చేమార్గంకూడా నీవే చెప్పు.

కృ—మీరు చావాలని నేను కోరడంలేదు నాన్నా! మీరు సుఖపడాలనే...

ధర్మ—(కొడుకుముఖం వైపు ముఖముంచి) నాయనా! (ఒడలు నిమురుతూ) నీవు పెద్దవాడవవాలి. పేరుప్రఖ్యాతులతో మన వంశానికి, కుటుంబానికి కీర్తి తేవాలి. కన్నతల్లిదం డ్రులకు గౌరవం తేవాలి. పరలోకంలో ఉన్నా నేనిదే ఆశిస్తాను. (కొడుకుని కౌగిలించుకొని చేరదీస్తాడు.)

కృ—అశుభ్రం పలికి నా మనస్సు కలచివేయకండి నాన్నా!

ధర్మ—అసమర్థుడ నని నన్ను మరచిపోయినా, సీతమ్మ దున్నా

అంతా రోజుల మాహాత్మ్యమే!

డని మరచిపోకు. జ్ఞానంలేని పసివాడు. ఎలా దరిచేరుస్తా వో వాడిని.

కృష్ణ—ఏమిటే అప్పగింతలు? అనవసరం ఏడుపులు.

ధర్మ—అవును. ఏడుపు అనవసరము. (కళ్ళు తుడుచుకొని) ఎందుకో యీమనోవ్యథ. ఏమిటో యీ ఆరాటం! చచ్చే వాడి కెందుకో యీతాపత్రయం ?

[ఇంతలో నాన్నా! నాన్నా! అంటూ రామం వగర్చుకుంటూ పరుగెత్తుకొని వచ్చాడు.]

ధర్మ—వచ్చావా! రామం! వచ్చావా! (కౌగిలించుకొని ఏడుస్తున్నాడు.)

రామం—(బెదురుచూపులతో, వగర్చుకుంటూ తండ్రికౌగిలిలో ఉన్నాడు).

కృష్ణ—(ఏమీ తోచక మాట్లాడడు.)

ధర్మ—(రామం ఒడలు నిమురుతూ) చచ్చేతండ్రిని చూడడానికి వచ్చేవా? రామం! నా పిచ్చినాన్నా! వచ్చావా? (ఏడుస్తుంటాడు.)

[పోలీసు కానిస్టేబిలు, వగర్చుకుంటూ పరుగెత్తుకొని వచ్చాడు].

పోలీ—ఏడీ? ఆదొంగ? ఎక్కడ?

కృష్ణ—ఎవరు దొంగ ?

పోలీ—అదుగో, వాడే! సినీమాలదగ్గర జేబు కత్తిరించాడు.

కృ—మావాడే?

ధర్మ—నా కొడుకే ?

పోలీ—ఆ! వాడే! పట్టుకోబోతే తప్పించుకొని పరుగుతీసాడు.

ధర్మ—(కొడుకుని పట్టుకొని గట్టిగా ఏడుస్తూ) ఎంత దౌర్భాగ్యుడివి పుట్టేవురా? ఇప్పుడు నేను ఏమి చేసేదిరా? ఎలా చావనురా? (అని పోలీసుతో) బాబూ! కొంచెం సాయ పడండి.

పోలీ—బాగుంది. దొంగను వదిలెయ్యమంటూరా?

కృ—అదెలా వీలవుతుంది. అసలు దొరక్కపోతే ఆలోచిద్దురు గాని......

పోలీ—(కోరగా చూస్తు) నడు. స్టేషనుకునడు. (అని ధర్మయ్య కౌగిలిలో ఉన్న రామూన్ని లాగివేస్తాడు.)

రామం—నాన్నా ! నాన్నా ! (అంటూ ఏడుస్తాడు.)

ధర్మ—రామూ ! రామం ! (వదలలేక ఏడుస్తాడు.)

పోలీ—నడు. నడు. (అని బలవంతంగా తీసుకొని పోతాడు.)

[ రామం బిక్కమొగంతో ఏడుస్తూ వెళ్ళిపోతాడు.]

ధర్మ—(దుఃఖంతో గత్యంతరం తోచక నిలచిఉన్న కృష్ణను చేరి) కృష్ణా! తమ్ముడిని విడిపించవు? ఒళ్ళంతా రక్తాలు చిమ్ముతుంటే "నాన్నా నాన్నా" అంటూ ప్రతిధ్వనించేలాగ ఏడుస్తున్నాడురా! ఆ ఇనుపఊచల మధ్యను, ఎండదొక్కతో, ఆపసిమూన ఉండలేడురా! దయా

దాక్షిణ్యాలులేని పోలీసులు రాతిబండలు మోయిస్తుంటే "అమ్మా! నాన్నా!" అంటూ నలిగిపోతున్నాడురా వెళ్ళరా! వెళ్లు! వాడిని రక్షించరా!

కృష్ణ—ప్రయోజన ముండదు నాన్నా! ఈసారివాళ్లు విడువరు.

ధర్మ—విడువరు. నాకొడుకుని విడువరు. తెలియకచేసిన నేరానికి కొట్టి చంపేస్తారురా! వీల్లేదు. వాడిఒంటిమీద ఈగ వాలడానికి వీలులేదు. నేనేవెడతాను.

కృష్ణ—(ఆపి) ఏమిటీ వెర్రి!

ధర్మ—వెర్రినాకుకాదు. మీఅందరికీను. లే అడ్డులే నేవెళ్ళాలి.

కృష్ణ—తొందరపడి ఏమీ సాధించలేరు.

ధర్మ—నాకొడుకును, పోలీసుల కప్పగించి నేనుబ్రతకలేనురా. వాడితోపాటే నేనూపోతాను. నాకూ చేతికి సంకెళ్లు వెయ్యమను. నేనుదొంగనే! నేనూదొంగనే! దొంగను రా! (అని గట్టిగాఅరచి పడిపోతాడు.)

కృష్ణ—(కృష్ణచూచి గాబరాతో) నాన్నా! నాన్నా!

ధర్మ—(పలుకడు.)

కృష్ణ—కొంపమునిగేలా ఉంది. ప్రకాష్! ప్రకాష్! (అంటూ పరుగెత్తి వెళ్ళుతాడు.)

ధర్మ—(ప్రాకుతూ లేచి) దొంగనురా. నేనుదొంగను. దొంగని కాదు. బడిపంతుల్ని. కాదుకాదు. పెళ్ళాంపిల్లల్ని

పోషించలేని, సన్యాసివిరా. పరువుప్రతిష్టలు పోగొట్టు కున్న నీచుణ్ణిరా! తండ్రితద్దినంకూడా పెట్టలేని దరిద్రుణ్ణిరా! అప్పులెగకొట్టే అధముడ్నిరా! కన్నకొడుకుని జైలుపాలు చేసిన కఠినుణ్ణిరా! నన్నెందుకురా బ్రతుకమంటారు. బ్రతకను. బ్రతుకలేను. (అంటూ చేయి మొలలోని తాళాలమీద పడగా, తాళాలలోని పిడిచాకును తీస్తాడు.) చంపు, నీపుత్ర్వరగాచంపు, నీవైనా సాయపడు. చంపు. (అని గుండెల్లో పొడుచుకుంటాడు.)

[ ప్రకాష్, ఉష, కృష్ణ గబగబా వస్తారు. ]

కృ—(పొడుచుకొని, పడిపోతున్న తండ్రినిచూచి) నాన్నా! నాన్నా! (అందరూ ఆతురతతో దగ్గరకు వెడతారు. గాయంవెంట రక్తం, కారుతూండగా, ధర్మయ్య, కృష్ణ చేతిలో ఒరుగుతాడు).

ప్రకా—డాక్టరు! డాక్టరు. (అని ఇటుఅటు చూస్తాడు.)

కృ—(చేతిలో తండ్రిప్రాణం వదలుతాడు.) ఇంకెందుకు డాక్టరు? అయిపోయింది. దీపం ఆరిపోయింది.

ఉష—ఆ! (అని ఆతురతతో ధర్మయ్య ముఖంలోకి చూస్తుంది. ధర్మయ్యని క్రింద పడుకోచేస్తుంది)

కృ—(దుఃఖం ఆపుకోలేక) నాన్నా! నాన్నా! (బిగ్గరగాఏడుస్తాడు)

ప్రకా, ఉష—(అతన్ని ఓదార్చడానికి ప్రయత్నిస్తారు.)

కృ—(తలబాదుకుంటూ) అన్నంతపని చేశావా నాన్నా!

అంతా రోజుల మాహాత్మ్యమే!

[ శాస్త్రి తొందరగా వచ్చి చూచి ]

శాస్త్రి—పాపం! చచ్చిపోయాడు. (అని వెళ్ళిపోతాడు).

కృష్ణ—చచ్చిపోయాడు. బడిపంతులు ధర్మయ్య చచ్చిపోయాడు అప్పులవాళ్ళు అందరూరండి. ఇదిగో శరీరం! తీసుకొని పొండి. ఇంతే దక్కిందని సంతోషించండి. రండి. (అంటూ వెర్రికేకలు వేస్తాడు.)

ప్రకా—ఊరుకో! కృష్ణా! ఊరుకో.

ఉష—బ్రతకడం కష్టం అయింది. చావు తేలికయిపోయింది. రోజులమహాత్మ్యమే.

కృష్ణ—నీవన్న దేనిజం. అంతా రోజులమహాత్మ్యం. ఒప్పుకుంటా నాన్నా! నీమాటే ఒప్పుకున్నాను. విను. నామాటవిను. నాన్నా! నాన్నా!

[ అంటూ తండ్రి శవంమీదపడి విలపిస్తాడు. పోలీసులతో ఇనస్పెక్టరు రాజారావు వస్తాడు. కృష్ణ "నాన్నా నాన్నా" అని విలపిస్తు ప్రకాష్ చేతిలో సొమ్మసిల్లుతాడు. ఇనస్పెక్టరు రాజారావు శవం దగ్గరగావచ్చి ]

రాజా—ఇంకా శ్వాసఉంది. ఊ! లేవాలి. మీరంతా దూరంగ పోవాలి. (అంతా అలాచేస్తారు.) నెం 205! డాక్టరు గారిని, మెజస్ట్రేటుగారిని అర్జంటుగా తీసుకొని రావాలి.

[ పోలీసుజవాను యస్ సార్! అని వెళ్ళిపోతాడు. శవాన్ని పోలీసు కస్టడీలో ఉంచుతారు. ]

(తెర పడుతుంది.)

# ఆఱవ రంగము.

---

[పోలీసుస్టేషనులో ఇనస్పెక్టరు రాజారావు కూర్చుని ఉన్నాడు. ఉదయంవేళ గోడగడియారం ఏడుగంటలు్ను సూచిస్తూ ఉంది. పోలీసు జవాను ఏవో కాగితాలను చూపిస్తుంటే ఇనస్పెక్టరు చదివి సంతకాలు పెడుతున్నాడు.]

ఇన—చచ్చేవాళ్ళు సరిగ్గా చావక, మధ్య మన ప్రాణాలు తీస్తారు. ఆధర్మయ్యధర్మమా అని, ఆత్మహత్య అని ఆఖరి మాటలన్నా అన్నాడుగాబట్టి, మాట దక్కింది. కాని, లేకపోతే ఇదో పెద్దకేసు. దీనికోసం ఇన్వెస్టిగేషను, మనకు చేతినిండా పని, నలిగి చచ్చిపోదుం.

పోలీ—చిత్తం. (అంటూ సంతకం పెట్టిన కాగితాలు తీసుకొని పోతాడు.)

[ఇనస్పెక్టరు కుర్చీలోనుండి లేచి, సిగరెట్టు ముట్టించి, ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంలో ఉంటాడు. ప్రకాష్ పరుగుపరుగున వచ్చాడు.]

ప్రకా—ఇనస్పెక్టరుగారూ! ఇనస్పెక్టరుగారూ!

ఇన—(ప్రకాష్‌ను చూచి) ఏమొచ్చింది బాబూ? మళ్ళీ ఏమొచ్చింది ?

ప్రకా—పోలీసుసహాయం కావాలి.

అంతా రోజుల మాహత్మ్యమే!

ఇన—ఎందుకు?

ప్రకా—రాత్రి మూడుగంటలవేళ, శంకరయ్యగారి లారీని బస్తా లతో సహా మావాళ్ళు పట్టుకున్నారు. లారీని, డ్రైవరుని ప్రస్తుతం మా కస్టడీలో ఉంచాము. ఇక మీరు రావాలి.

ఇన—ఐ సీ! 607! నలుగురిజవానులతో నీవు వెళ్ళి వీరు చూపించిన లారీని డ్రైవరుతోసహా తీసుకురావాలి. క్విక్.

పోలీ—ఎస్ సార్. (ప్రకాష్‌తో) రండి సార్!

ఇన—(ప్రకాష్‌తో) మీ రాలారీని తీసికొనిరండి. నేను శంకరయ్యగారిని తీసికొనివస్తాను.

ప్రకా—థేంకు యు. (అని వెళ్ళిపోతాడు).

[ఇనస్పెక్టరు బయటకు పోతూ ఉండగా, శంకరయ్య, శాస్త్రి ఎదురు వస్తారు.]

శంక—గుడ్ మార్నింగ్. ఇనస్పెక్టరుగారూ!

శాస్త్రి—నమస్కారం బాబూ, నమస్కారం.

ఇన—శంకరయ్యగారా! రండి, రండి.

[శంకరయ్య తొందరపాటుగా వచ్చి కూర్చున్నాడు. శాస్త్రి గాబరాగా నిలబడి ఉన్నాడు.]

ఇన—మీరే స్వయంగా వచ్చేసారు?

శంక—ఆ. చెప్తా. విషయం చెప్తాను. (అటు యిటు చూచి) ఇప్పుడే డి. ఎస్. పి. దొరగారితో మీ ప్రమోషనునిషు

యము మాటలాడి వస్తున్నాను. అలాగే చూద్దామ
న్నారు.

ఇన—థేంకు యు. థేంకు యు.

శంక—(లేచి దగ్గరగా వెళ్ళి) మరి మీవల్ల చిన్న ఉపకారం
జరగాలి.

ఇన—నావల్లే ?

శంక—మీవల్లనే. (ఇటు అటు ఎవ్వరు లేకుండా ఉండడం
చూచి, నోట్లకట్ట తీసి) ఇది మీవద్ద ఉంచండి.

ఇన—(దూరంగా తొలగి) ఇదేమిటి? ఇదెందుకు నాకు?

శంక—చెప్తానుగా విషయం. ముం దిది ఉంచండి.

ఇన—నాకు యిలాంటి అలవాట్లు లేవని మీకు తెలియదూ?

శంక—ఇదివరకు లేకపోవచ్చు. ఇప్పటినుంచి అలవాటు చేసు
కొంటే సరి.

శాస్త్రి—ఉంచండి సార్. ఉంచండి.

ఇన—మిస్టర్ శాస్త్రీ! యు ప్లీజ్ డోన్ట్ టాక్. శంకరయ్య
గారూ! నే నీవిషయంలో మీ కేమీ సహాయం చేయ
లేను.

శాస్త్రి—అప్పుడే ఆవిషయం మీవరకూ వచ్చేసిం దన్నమాట.

శంక—ఇందులో మీ కేమీ ప్రమాదం లేకుండా నేను కాచు
కుంటా. మీరలా చూస్తీచూడనట్లు వదిలేస్తే చాలు.

ఇన—అది నా సాధ్యంకాదు. నాడ్యూటీ నేను చేయకతప్పదు.

అంతా రోజుల మాహాత్మ్యమే!

శంక—ఆ. మీరా పోలీసు ఆఫీసర్సు నాకు తెలియక కాదు. ఇప్పా డీ రిస్కు దాటించారా?...మీకు సునాయాసంగా ప్రమోషను వస్తుంది. కొంచెం ఆలోచించండి.

శాస్త్రి—ఆలోచించండి సార్. ఆలోచించండి.

ఇన—అధికప్రసంగాలు వద్దు. మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాను.

శంక—నన్నే ?......

ఇన—శాస్త్రీ! మిమ్మల్ని కూడా.

శాస్త్రి—అమ్మో! (అని అలాగే కొయ్యబారిపోతాడు)

శంక—ఊఁ! బాగానేఉంది. నన్నే అరెస్టు చేస్తారన్నమాట.

ఇన—ఆ మిమ్మల్నే! కాంగ్రెసు బురఖాలోఉన్న శ్రీ శ్రీ శంకరయ్యగారినే.

శంక—నన్ను తెలిసుకొనే మాట్లాడుతున్నారా ?

ఇన—ఆ మిమ్మల్ని, మీపలుకుబడిని తెలుసుకొనే...

శాస్త్రి—మంత్రిగారు వీరికి... (అని ఇనస్పెక్టరుతో చెప్పబోతాడు.

ఇన—షటప్! అన్నీ నాకు తెలుసు.

శంక—అన్నీ తెలిసే ఈపనికి పూనుకున్నారన్నమాట.

ఇన—ఆ పూర్తిగా.

శంక—కాళ్ళవద్దకు రప్పించగలవాణ్ణిని, నేను మీవద్దకు ఎందుకు వచ్చానో......

ఇన—మీపలుకుబడికి జడిసి, మీతో చేయి కలుపుతానని...

శంక—సరే. (అని వెళ్ళబోతాడు.)

ఇన—అడుగు కదపడానికి వీల్లేదు. శాస్త్రీ. (అని గద్దిస్తాడు.)

శంక—ఏమిటీ నిర్బంధం ?

ఇన—అంతే. నాకు సంజాయిషీ ఇచ్చేవరకూ!

శంక—డి. యస్. పి. కి ఫోన్‌చేస్తే.

ఇన—ఒక్క డి. యస్. పి. కేకాదు. మీకెంతవరకూ ఇన్‌ఫ్లూయన్సు ఉందో అంతవరకూ ఫోన్‌చేయండి. నాడ్యూటీ నేను తప్పను.

శంక—ఆధారం లేకుండానే అరెస్టు.

ఇన—రాత్రి మీరుపంపిన బస్తాలే ఆధారం.

శంక—ఆబస్తాలు నావికావు.

శాస్త్రి—బలే! బలే.

ఇన—అవునోకాదో తరువాత ఋజువుచేద్దురుకాని, ముందు మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాను. (పోలీసులకు ఆజ్ఞఇవ్వగా బేడీలు పట్టుకొని వస్తారు.)

శాస్త్రి—కోరివిపెట్టి తలగోక్కున్నామురా బాబూ.

శంక—పెద్దమనుష్యుల్ని అరెస్టు చెయ్యబోతున్నారు. మళ్ళీ ఆలోచించుకోండి, ఇనస్పెక్టరుగారూ,

ఇన—పెద్దమనుష్యులు. అంతా పెద్దమనుష్యులే. కానిదెవరు ? బేడీలు తగిలించండి. (పోలీసులు అలా చేస్తారు.)

అంతా రోజుల మాహాత్మ్యమే!

[ తెరలో "ప్రజాభ్యుదయ సంఘానికి జిందాబాద్! ప్రకాష్ బాబు జిందాబాద్! శంకరయ్య డౌన్! డౌన్! శాస్త్రి డౌన్." అని ప్రజల కోలాహలం. పోలీసువారు, ప్రకాష్ వస్తారు. ]

పోలీ—ఇదిగో! లారీ డ్రైవరువద్ద దొరికిన చీటీ.

ఇన—శంకరయ్యగారూ! ఇది తమస్వదస్తూరితో లారీ డ్రైవరు ద్వారా పంపిన ఉత్తరం. చాలా. ఇంకా సాక్ష్యం కావాలా!

శాస్త్రి—మరి నన్నెందుకండి అరెస్టు!

ఇన—ఆయన ఏజంటుగా పనిచేసినందుకు.

శాస్త్రి—నేనేమీ చేయలేదండి బాబూ!

ఇన—అదంతా కోర్టువారిదగ్గర ఋజువుచేసుకోండి.

శాస్త్రి—ఎరగక పోయివచ్చానురా భగవంతుడా.

ప్రకా—ఇంతవరకూ ఆయనకూడాఉండి ఇప్పుడాదిలేస్తే ఎలాగ ఇప్పుడుకూడా ఉండవలసిందే!

శంక—ప్రకాష్ (గట్టిగా అరుస్తాడు.)

ఇన—ఇది పోలీసుస్టేషనుసార్! స్టేషను.

[ తెరలో శంకరయ్య డౌన్! డౌన్! ప్రకాష్ ఉషలు సంవడి చేయనద్దని సౌజ్ఞ చేస్తారు. ]

శంక—(తలవంచుకొని నిలబడతాడు.)

ఉష—కన్నకూతురే కత్తికట్టిందని, నామీద కోపగిస్తున్నావా నాన్నా! అన్నమోరామచంద్రా అని విలపించే ఎందరో

నోరూ వాపిలేని పేదలకోసం— ఎంత పలుకుబడి గలవా రైనా, ప్రజాద్రోహులను, ఎప్పటికైనా, శిక్షతప్పదని, నిరూపించడంకోసం, నీతో విరోధపడ్డాను. కాని నాకు తండ్రిగా నిన్నిక్కడ ఈ బేడీలతో చూచి దుఃఖిస్తున్నాను దేశంకోసం— ప్రజలకోసం, కన్నతండ్రినైనా నాసరే— అన్యాయం చేస్తున్నప్పుడు, సహించకూడదని, నిర్ణయం నన్నీ పని చేయించింది. తప్పో! ఒప్పో! నీవేనిర్ణయించుకో. ఒక్క మాటమాత్రం చెపుతున్నాను. తండ్రిగా నిన్నెప్పుడూ పూజిస్తూనే ఉంటాను. నీమనస్సు మార్చుకొని, ప్రజాభ్యుదయంకోసం, నీవు పాటుపడితే, నిన్ను చూచి గర్విస్తాను. హృదయపూర్వకంగా స్వాగతమిస్తాను. అంతే!

శంక—(కళ్ళనీళ్ళు విడుస్తు) తల్లీ! ఉషా! నిన్ను చూచి గర్విస్తున్నానమ్మా. నిన్ను చూచి గర్విస్తున్నానమ్మా!

ఇన—శంకరయ్యగారూ! లోపలికి దయచేయండి.

[శాస్త్రి, శంకరయ్యలను పోలీసులు తీసుకొనిపోతారు.]

శాస్త్రి—(పోలీసులవెంట నడుస్తూ) ఆనాడు నా రోజులు, ఈనాడు మీ రోజులు. అంతా రోజులమాహాత్మ్యమే!

పకా—మిస్టర్ రాజారావ్! నీసహాయానికి చాలా కృతజ్ఞులం!

ఇన—ఇది నాడ్యూటీ.

పకా—ఇలా ప్రజలు, ప్రభుత్వం చేయి చేయి కలిపి కొనే దేశానికి క్షేమం.

ఉ—ఇనస్పెక్టరు రాజారావుకీ జై!

[అంతా జై అంటారు.] Date..